# విజయ

ప్రతి నెల 20వ తారీఖున విడుదల




(1) "విజయ" సాంఘిక కథల మాస పత్రిక. ఇందులో ప్రఖ్యాత రచయిత (త్రు) లందరి కథలూ ప్రతినెలా ఉంటాయి. ఉదాహరణకు మొదటి నెల పత్రికలో వాసిరెడ్డి సీతాదేవి, మాదిరెడ్డి సులోచన, శేషోపతి, ఆనందారామం, యస్.యస్. లాల్, విజయలక్ష్మి మొదలగువారి కథలు వున్నాయి.

(2) కథలు భాగం మొత్తం 128 పేజీలు గాక 32 పేజీలు సినిమా పత్రిక ఒకటి వుంటుంది. ఇప్పు డొస్తున్న పత్రికల్లో సినిమా వార్తలు ఒక భాగంగా వుంటోంది. అలాగాక "విజయ"లో కథల పత్రికతోపాటు

## ఎడిటర్
## విజయ బాపినీడు

"సినిమా పత్రిక" ప్రత్యేకంగా వుంటుంది. (3) 128 పేజీల కథల పత్రిక, 32 పేజీల సినిమా పత్రికా గాక, యింకా 112 పేజీల ఫుల్ నవల కూడా ఒకటి వుంటుంది. నవలలు అంద జేస్తున్న పత్రికలు మార్కెట్‌లో ఎన్నో వున్నాయి. "విజయ" అందివ్వబోతున్న నవల కథల పత్రికలో ఒక భాగంగా రాక ప్రత్యేకంగా 6 రంగుల ముఖ చిత్రంతో విడిగా వుంటుంది. అంటే "విజయ" కేవలం ఒకే పత్రిక కాదు. ఒక కథల పత్రిక, ఒక సినిమా పత్రిక, ఒక నవల వుంటాయి. (4) అంతే కాదు, 32 పేజీల సీరియల్ నవల 6 రంగుల ముఖ చిత్రంతో వుంటుంది. అంటే ఒక్క "విజయ"తో కొన్న వారికి నాలుగు విడివిడి పుస్తకాలు చేతికి వస్తాయి. ఇంటిలో సినిమా సరదా వున్న వారు సినిమా పత్రికా, నవల యిష్టమున్న వారు నవలా, అర్జంటుగా ప్రఖ్యాత రచయితల కథలు చదవాలనుకున్న వారికి కథల పత్రికా, సీరియల్ చదవాలనుకున్నవారికి సీరియల్ నవలా వుంటాయి. నాలుగు పుస్తకాలూ కలిపి వుండేలా కొత్తరకం బైండింగ్ అమలు చేస్తున్నాం. ఇంతవరకు యీ రకం బైండింగ్‌తో పత్రికలు వెలువడలేదని చెప్పవచ్చు. విజయలో పేజీల సంఖ్య 300. సైజు సుమారుగా సినిమా రంగం సైజు.

పత్రిక ధర:
కథలపత్రిక 2.00
సినిమాపత్రిక 0.75
నవల 3.00 సీరి
యల్ నవల 0.75
మొత్తం వెల: 6.50
అరున్నర రూపాయలు
పెట్టి పత్రికను కొంటే
అంతకుమించిన ఆకర్షణ
వుండదు. చక్కటి కథలు
కావచ్చు. పెద్ద నవల ఉండొచ్చు.
సినిమా పత్రిక. సీరియల్ నవలా
అవవచ్చు. ఏమైనా రూ. 6.50
టూమచ్. అందుకని వీటన్నిటిని
కలిపి 3 రూపాయలకే అందించ
మన్నాం. పత్రిక వెల 3 రూ.లు.

వివరాలకు :

విజయ,
80, ధనలక్ష్మి కాలనీ, మద్రాసు-26.

జగపతిస్టాఫ్ ఎంటర్ ప్రైజెస్

# పిచ్చిమారాజు

ఈస్ట్‌మన్ కలర్

దర్శకుడు వి.బి.రాజేంద్రప్రసాద్ B.Sc.

నిర్మాతలు

పి.ఎస్.రెడ్డి, ఎస్.ఎస్.రామమూర్తి






alpana

సోల్ డిస్ట్రిబ్యూటర్స్ అన్నపూర్ణ పిక్చర్స్ అన్నపూర్ణ ఫిలిమ్స్ రిలీజ్





# క్వాలిటీ కవలలు గ్లూకోస్ మారీ

క్వాలిటీవారు వాడే వస్తువులు, యంత్రములు అత్యుత్తమమైనవి. చౌకవస్తువులు వాడటానికి యిష్టపడరు. చివరకు వారి కార్మికులు కూడాను! అందుకే క్వాలిటీ బిస్కట్లంటే అందరికీ అభిమానం. క్వాలిటీ బిస్కట్లను ఈ రోజు మాత్రమే మా కోరికమీద కొనండి. అటు తర్వాత మీ అంతట మీరే కొంటారు.

క్వాలిటీ అంటే ఉత్తమమైన బిస్కట్లు అన్నమాట




క్వాలిటీ ఫుడ్ ప్రాడక్ట్స్

Rachana KFP-44 Tel

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'

సంచాలకుడు : నాగిరెడ్డి

---

ఈ సంచిక నుండి "మాయాసరోవరం" అన్న కొత్త రంగుల బొమ్మల సీరియల్ ప్రారంభమవుతున్నది.

ఈ నెల బేతాళకథ ["మారని మనిషి"] వీరేపల్లి జయరాంరెడ్డి రచన. మనిషికి ఒక లక్ష్యం ఉన్నప్పుడు, తన దృక్పథానికి భంగంరాని విధంగానే ఆ మనిషి జీవించాలి. దీన్నే ఈ కథ స్పష్టంచేస్తుంది.

ఈవి లేనిచోట సంపద జనాన్ని దూరంగా ఉంచుతుంది. ఇది "పాపిష్ఠి సొమ్ము" అన్న కథలో చూస్తాం.

---

సంపుటి 58 జనవరి '76 సంచిక 1





**31**

దొంగలనాయకుడు చెప్పినట్టే అతని అనుచరులు రాజు కొడుకునూ, మంత్రి కొడుకునూ, కోశాధికారి కొడుకునూ, వారి వెంటవస్తున్న సుబుద్ధినీ పట్టుకుని తీసుకు వచ్చారు.

దొంగలనాయకుడు వాళ్ళను సోదా చేస్తే అతనికి ఏమీ దొరకలేదు. అందు చేత అతను తనకు నచ్చిన పైపంచ ఒకటి తీసుకుని, నలుగురినీ వదిలి పెట్టాడు.

వాళ్ళు వెళ్ళిపోతూంటే పక్షి మళ్ళీ అరిచింది. నాయకుడు వాళ్ళను మళ్ళీ తెప్పించి, మరింత శ్రద్ధగా సోదా చేశాడు. కాని అతనికి ఏమీ దొరకలేదు. అతను వాళ్ళను మళ్ళీ వదిలేశాడు. వాళ్ళు పోతూంటే ఈ సారి పక్షి మరింత గట్టిగా అరిచింది.

నాయకుడు వాళ్ళను మళ్ళీ తెప్పించి, "మీ వద్ద మణులున్నాయని పక్షి చెబుతున్నది. అవి ఎక్కడ?" అని అడిగాడు.

"మా దగ్గిర మణులుంటే నువు సోదా చేసినప్పుడు దొరకవా?" అన్నారు వాళ్లు.

"పక్షి పదేపదే చెబుతున్నది గనక మీ వద్ద మణులు ఉండి తీరాలి. అవి మీ వంటి మీద లేవుగనక, మీరు వాటిని మింగి వుంటారు. ఇప్పుడు చీకటి పడుతున్నది. రేపు ఉదయమే మీ పొట్టలు చీల్చి మణులు ఉన్నాయో, లేదో చూస్తాను." అంటూ దొంగలనాయకుడు వారిని ఒక కొట్టులో బంధింపజేశాడు.

ఆ రాత్రి చాలాసేపు మేలుకుని సుబుద్ధి ఇలా ఆలోచించాడు:

"రేపు ఉదయం ఈ దొంగ మిగిలిన ముగ్గురి పొట్టలూ చీల్చి, అందులో

అట్ట చివరి బొమ్మ

మణులున్న సంగతి గ్రహించినమీదట, నా పొట్టలో కూడా ఒక మణి ఉంటుం దన్న ఆశతో నన్ను కూడా చీల్చుతాడు. ఎలాగూ నా చావు తప్పదు. నేను ఏం చెయ్యాలి? బుద్ధిమంతులు తమ చావు తప్పదని తెలిసినప్పుడు ఎవరికైనా మేలు చేసి ఉత్తమ లోకాలు సంపాదించు కుంటారని చెబుతారు. అందుచేత రేపు ఉదయం దొంగలనాయకుణ్ణి మొదట నా పొట్టనేచీల్చనిస్తే, మిగిలిన ముగ్గురూ బతికిపోతారు. నా పొట్టలో మణి దొరకక పోయే సరికి దొంగలనాయకుడికి పక్షి జోస్యంలో నమ్మకం పోతుంది. వాడు విరక్తితో మిగిలిన ముగ్గురినీ విడిచిపుచ్చు తాడు. వాళ్ల ధన ప్రాణాలు దక్కించి నందుకు నాకీర్తి ఇహంలోనూ, పరంలో నూ కూడా వ్యాపిస్తుంది. నా పాపాలన్నీ పరి హారంఅయిపోతాయి. రానున్న చావును బుద్ధిమంతుడు ఎదుర్కొనటానికి ఇంత కన్న మేలైన మార్గం లేదు.''

ఇలా అనుకుని సుబుద్ధి మిగిలిన వాళ్ళకు నిజం చెప్పేసి, తన ఎత్తు వివరించాడు. వాళ్ళు కృతజ్ఞతతో అతన్ని కౌగలించుకుని, తమ కృతజ్ఞత మళ్ళీ, మళ్ళీ తెలుపుకున్నారు.

తెల్లవారగానే దొంగల నాయకుడు ఆ నలుగురినీ తన వద్దకు రప్పించి, పొట్టలు చీల్చే సన్నాహం చేశాడు.

అప్పుడు సుబుద్ధి చేతులు జోడించి, దొంగల నాయకుడితో, ''నా కళ్ల ముందు



నా సోదరుల పొట్టలు చీలటం నేను భరించలేను. నా యందు అనుగ్రహం ఉంచి, ముందు నా పొట్ట చీల్చు.'' అన్నాడు.

దొంగల నాయకుడు అతన్ని కనికరించి, ముందుగా అతని పొట్టనే చీల్చాడు. కాని ఎంత వెతికినా అందులో మణి లేదు.

అది చూసి దొంగల నాయకుడు పశ్చాత్తాపంతో కుమిలిపోతూ, ''అయ్యో, పక్షిని నమ్మి, ధనాశతో ఎంత పాపిష్ఠిపని చేశాను! మిగిలిన వాళ్ళ పొట్టలలో కూడా రత్నాలు ఉండవు. వారిని హింసించటం వృథా!'' అనుకుని వారిని విడిచిపుచ్చాడు.

ఆ ముగ్గురూ క్షేమంగా అరణ్యం దాటి రత్నపురం చేరి, ఒక సత్రంలో బసచేసి, ఆముదం తాగి తమ మణులను తిరిగి పొందారు. కోశాధికారి కొడుకు వాటిని ఆ నగరంలోని వర్తకులకు అంతులేని ధనానికి అమ్మి, ఆ డబ్బంతా రాజు కొడుక్కు ఇచ్చాడు.

ఆ సమయంలో రత్నపురాన్ని ఏలుతున్నవాడు ఒక రాజద్రోహి. వాడు రాజవంశాన్ని నిర్మూలించి, రాజ్యం కాజేసి, ప్రజా కంటకుడుగా పాలిస్తున్నాడు. అందుచేత రత్నపుర రాజ్యాన్ని జయించాలని రాజుకొడుకుకు ఆలోచన కలిగింది. అతను మంత్రి కుమారుణ్ణి తన మంత్రిగానూ, కోశాధికారి కొడుకును తన కోశాధికారిగానూ నియమించాడు.

వారు ముగ్గురూ పొరుగు రాజ్యానికి వెళ్ళి, డబ్బు మంచినీరు లాగా ఖర్చు చేసి, చతురంగ బలాలను సమకూర్చుకున్నారు. ఈ సైన్యంతో వారు రత్నపురం మీదికి దండెత్తి వచ్చారు. రత్నపుర రాజ్యం వారి వశమయింది. రాజకుమారుడికి వైభవంగా రాజ్యాభిషేకం జరిగింది. అతను పొరుగు రాజుకూతురిని పెళ్ళి కూడా చేసుకున్నాడు. తరవాత అతను రాజకార్యాలను తన మిత్రులిద్దరి మీదా వదిలి, తన కొత్త భార్యతో సుఖసౌఖ్యాలలో తేలిపోసాగాడు.





చాలా కాలం క్రిందట అమరావతీనగర రాజుగారి ఆస్థానంలో, కులశేఖరుడనే రాజోద్యోగి వుండేవాడు. ఆయనకు జయశీలుడనే ఒక్కగానొక్క కొడుకు. బాల్యంలోనే తల్లిని పోగొట్టుకున్న జయశీలుణ్ణి, కులశేఖరుడు ఎంతో గారాబంగా పెంచాడు. జయశీలుడు ఇరవై ఏళ్ళ వయసు వాడయేసరికి, అన్ని విద్యలతో పాటు, క్షత్రియోచితమైన యుద్ధవిద్యలలో కూడా ప్రవీణుడనిపించుకున్నాడు.

కులశేఖరుడు తన కొడుకును, రాజుగారికి పరిచయం చేసి, ఆస్థానంలో ఏదైనా ఉద్యోగంలో ప్రవేశపెట్టుదామని ఆలోచిస్తూండగా, హఠాత్తుగా జబ్బు చేసి, కొద్ది రోజుల్లోనే మరణించాడు.

జయశీలు డిప్పుడు ఒంటరివాడు. అతడి మంచి చెడ్డలు చూస్తూ, అతణ్ణి సక్రమ మార్గంలో నడిపించేందుకు దగ్గిర బంధువులు కూడా ఎవరూ లేరు. ఈ పరిస్థితుల్లో జయశీలుడికి, దుర్వ్యసనాల్లో మునిగి తేలే కొందరు యువకులతో స్నేహం ఏర్పడింది. అతడు వాళ్ళతో కలిసి, తండ్రి వదిలిపోయిన ఆస్తిని విచ్చలవిడిగా ఖర్చు చేస్తూ, త్వరలోనే జూదగృహాలకు కూడా వెళ్ళటం ప్రారంభించాడు.

తండ్రి పోయిన నాలుగైదు నెలల్లోపునే జయశీలుడు తనకున్న ఆస్తి అంతా పోగొట్టుకున్నాడు. ఆ దుర్దశలో అతడు ఒకసారి మూడు రోజులపాటు తిండి




కూడా లేకుండా, మాసిన గుడ్డలతో వీధిలోకి వచ్చేందుకు సిగ్గుపడి, జూదగృహంలోనే వుండిపోయాడు. జూదరులలో కొందరు దయతలిచి పెట్టిన ఆహారాన్ని తినేందుకు ఆత్మాభిమానం అడ్డువచ్చి, జయశీలుడు పస్తులుండటం చూసి, దేవశర్మ అనే అతడి మిత్రుడు, జయశీలుడికి దుఃఖం మాని, ముందుమార్గ మేమిటో ఆలోచించమని హితవుచెప్పాడు.

అసలే ఆకలితోనూ, దుఃఖంతోనూ కుమిలిపోతున్న జయశీలుడు, మిత్రుడి మాటలకు కోపం తెచ్చుకుని, ''దేవశర్మా, నువ్వు చెప్పే హితవులూ, నీతివాక్యాలూ నాకు తెలియనివి అనుకుంటున్నావా? నువ్వూరుకో. నా చావేదో నన్ను చావనీ,'' అన్నాడు.

ఆ జవాబుకు దేవశర్మ చిరునవ్వు నవ్వి, ''జయశీలా, అన్నీ తెలిసి, నువ్వెందుకీ జూదగృహంలో అడుగుపెట్టావో, నా కర్థంకావటంలేదు! మనం అడే పాచికలు దరిద్రదేవత నేత్రాలనీ, బ్రహ్మ జూదగాడి ముఖాన దుమ్మే, పట్టు పరుపుగా: వీధులే, ఇళ్ళుగా లిఖిస్తాడనీ నీకు తెలిసినట్టు లేదు. నువ్వు విద్యావంతుడివి. దుఃఖిస్తూ కూర్చోవటం ఎందుకు? బ్రతుకుతెరువుకు, ఏదైనా మార్గం ఆలోచించు,'' అన్నాడు.

జయశీలుడు కొంచెంసేపు మౌనంగా వూరుకుని, తరవాత ఏదో నిశ్చయానికి వచ్చినవాడిలా తల పంకిస్తూ, ''దేవశర్మా, నువ్వు నిజమైన మిత్రుడివ్వదగిన సలహా యిచ్చావు. ఎంతో గొప్పగా బతికిన యీ నగరంలో, పేదగా జీవించటం నా కిష్టంలేదు. మరేదైనా దేశానికి వెళ్ళిపోతాను. ఏమంటావు?'' అన్నాడు.

ఈ మాటలకు దేవశర్మ జవాబివ్వబోయేంతలో జూదగృహం ముందు కలకలం బయలుదేరింది. జయశీలుడూ, దేవశర్మా అటుకేసి పోబోయేసరికి, కృపాణజిత్తు అనే రాజుగారి అశ్వదళ నాయకుడు, చేతిలో పెద్ద కొరడా పట్టుకుని, వెంట

మరి నలుగురు భటులు రాగా, జూద గృహంలో వాళ్ళను కొరడాతో ఎడా పెడా కొడుతూ, వాళ్ళున్న చోటుకు వచ్చాడు.

జయశీలుడు, కృపాణజిత్తు ముందుకు పోయి, "అయ్యా, ఏమిటీ దురన్యాయం? అలా విచక్షణా రహితంగా, కనపడ్డ వాళ్ళందరినీ కొట్టటం ధర్మం కాదు," అన్నాడు.

"ఆహాఁ, జూదరి నాకు ధర్మ బోధ చేయటం! అద్భుతం!" అంటూ కృపాణ జిత్తు కొరడాతో జయశీలుణ్ణిగట్టిగాకొట్టాడు.

జయశీలుడు దెబ్బ తగలగానే, చర్రు మంటూ ఎగిరి, దాపులనున్న కర్ర ఒకటి తీసుకుని, కృపాణజిత్తు తలమీద గట్టిగా మోదాడు. దెబ్బతింటూనే కృపాణజిత్తు కోపంతో ఒక్క అరుపు అరిచి కత్తి దూయబోయాడు. అతడు కత్తి దూసే లోపలే జయశీలుడు అతడి నడుంమీద గట్టిగా ఒక్క తన్నుతన్నాడు.

కృపాణజిత్తు ఒక చావుకేకపెట్టి కింద పడి లేచి, వీధి ద్వారం కేసి పరిగెత్త సాగాడు. ఇదిచూసి తతిమ్మా జూదగాళ్ళు, అతడి వెంటవున్న భటుల మీద కలియ బడ్డారు. పరిగెత్తిపోయి తన గుర్రాన్నెక్కి పారిపోజూస్తున్న కృపాణజిత్తును వెంట బడి తరిమి, జయశీలుడు అతడి వెనకగా గుర్రం మీద దూకి, ఒక చేత్తో దాని కళ్ళాలు పట్టుకుని, రెండవ చేత్తో కృపాణ జిత్తు జుట్టు పట్టు కుని, మోచేతులతో అతణ్ణి కుమ్మసాగాడు.





ఆ తాగుబోతు వెధవలిద్దరూ ఎవరు? నా దగ్గిరకు తీసురా,'' అని ఆజ్ఞా పించాడు.

కొద్ది సేపటికల్లా నౌకరు కృపాణ జిత్తునూ, జయశీలుణ్ణీ వెంటపెట్టుకుని రాజుగారి దగ్గిరకు వచ్చాడు. రాజు తన అశ్వదళ నాయకుణ్ణి గుర్తుపట్టాడు. ఆయన జయశీలుణ్ణి ఎరగడు. మంత్రి, జయశీలుణ్ణి అతడి తండ్రి వెంట ఒకటి రెండుసార్లు చూసి వున్నాడు. ఆ కారణం వల్ల ఆయన జయశీలుణ్ణి గుర్తించాడు.

రాజు కోపంగా, తన దళనాయకుణ్ణి, "జిత్తూ! నువ్వు, నా అశ్వదళనాయ కుడివి, గౌరవనీయుడివి. రాజవీధిలో గుర్రం మీద, యీ దొమ్మరి విద్యా ప్రదర్శనం ఏమిటి?'' అని అడిగాడు.

"మహారాజా, వీడు జూదరి! వెనక నుంచి నా గుర్రం మీద దూకి, నన్ను చావ చితకకొట్టాడు. వీణ్ణి తమరు తగినవిధంగా శిక్షించాలి,'' అన్నాడు కృపాణజిత్తు పళ్ళుకొరుకుతూ.

ఆ మాటలకు రాజు నవ్వి, "ఒరలో కత్తివున్న, నా అశ్వదళనాయకుణ్ణి, నిరాయుధుడైన ఒక సామాన్య జూదరి చావు దెబ్బలు కొట్టటం అంటే, చాలా వింత పడవలసిన సంగతే కాక, సిగ్గుపడ వలసిన సంఘటన కూడా! అసలు

గుర్రం రాజవీధి వెంట పరిగెత్త సాగింది. ఒక గుర్రం మీద ఇద్దరు రౌతుల యీ కుమ్ములాట చూసి, జనం వింత పడిపోయారు. వాళ్ళల్లో కొందరు చప్పట్లు చరుస్తూ, గుర్రం వెనక బయలుదేరారు. గుర్రం అలవాటు ప్రకారంపోయి రాజ భవనం ముందు ఆగింది.

ఆ సమయంలో రాజుగారు భవనం పై భాగాన నిలబడి, మంత్రితో ఏవో సంప్రతింపులు చేస్తున్నాడు. వీధిలో కేకలు పెడుతున్న జనాన్నీ, ఇద్దరు రౌతులతో పరిగెత్తుకొస్తున్న గుర్రాన్నీ చూసి ఆయన ఆశ్చర్యపోతూ, నౌకరొకణ్ణి పిలిచి, "ఆ గోల ఏమిటి? గుర్రం మీద

నీ కీ జూదరితో. తగవులాట ఎందుకు వచ్చింది ?'' అని అడిగాడు.

'' మహారాజా ! రాజవీథిలో వున్న జూదగృహంలో. ఆటలాడే వీళ్ళంతా, అరుగుల మీదా, గడపల దగ్గిరా కూర్చుని, వీధివెంట ఎంత పెద్ద అధికారి వెళుతున్నా లేచి నిలబడనైనా నిలబడరు. మర్యాద నేర్పేందుకు నేను జూదగృహంలో ప్రవేశించాను. అక్కడ యీ దుష్టుడు నా మీద కలబడ్డాడు.'' అన్నాడు కృపాణజిత్తు.

రాజు. ఏంచేద్దామన్నట్టు మంత్రి కేసి చూశాడు. మంత్రి ఒకసారి చిన్నగా దగ్గి, '' మహారాజా. కారణం ఏమైనా, మన దళ నాయకుడి పరువు ప్రతిష్ఠలు నలుగురిలో నవ్వులపాలయినై.'' అన్నాడు.

''అవునవును. అలాంటివాడు. నా అశ్వ దళ నాయకుడుగా వుంటే. నా పరువుతో పాటు, శత్రువుల దృష్టిలో తేలికవ్కూడా అయిపోతాను.'' అని రాజు ఒక క్షణం ఆగి. కృపాణజిత్తుతో, ''జిత్తూ. నీ పిరికితనం కారణంగా. నా సైన్యం అంతకూ తలవొంపులు తెచ్చావు. నీ కిదే. దేశబహిష్కరణ శిక్ష వేశాను. రెండు రోజుల అనంతరం, నా దేశసరిహద్దుల్లో ఎక్కడ కనిపించినా. నీ తల తీయించేస్తాను. కత్తి అక్కడ పెట్టి, తక్షణం వెళ్ళిపో.'' అన్నాడు.



కృపాణజిత్తు ఏదో చెప్పకోబోయాడు గాని, రాజు చేయెత్తి వారించాడు. ఇక రాజుకు మరింత కోపం తెప్పించితే. ఆ నిమిషానే తల ఎగిరిపోతుందని అతడు భయపడి. కత్తిని నేలమీద పెట్టి. తల వంచుకుని వెళ్ళిపోయాడు.

రాజు. జయశీలుడికేసి కొరకొర చూస్తూ, '' ఒరే, జూదరీ! నీకు శిరశ్ఛేద శిక్ష విధించాను. ఏమన్నా చెప్పకోవాలంటే చెప్పకో.'' అన్నాడు.

తన దారిద్ర్యావస్థను తలుచుకుంటూ, నిరాశా నిస్పృహల్లో వున్న జయశీలుడు, రాజు మాటలకేమీ భయపడక. ''మహరాజా, తమరు నాకు శిరశ్ఛేదం విధించాక,



ఇక నేను చెప్పేకునేందు కేమున్నది?" అన్నాడు.

"నీకు ప్రాణభయం లేదా?" అని అడిగాడు రాజు ఆశ్చర్యంగా.

"దారిద్ర్య భయం ముందు, ప్రాణ భయం ఏపాటి, మహారాజా?" అన్నాడు జయశీలుడు.

"అవునవును. జూదం, వ్యసనాల తల మానికం, అన్నారు గదా, పెద్దలు!" అన్నాడు రాజు.

"నిజం, మహారాజా! అంతా పోగొట్టుకుని, బంధువులచేతా, మిత్రులచేతా వదిలివేయబడిన జూదరులు, యోగుల మాదిరిగానే, యీ లోకంలో దేనికీ భయపడరు," అని మంత్రి ఒక క్షణం ఆగి, "నా దొక చిన్న మనవి, మహారాజా," అన్నాడు.

"ఏమిటది?" అని అడిగాడు రాజు.

"జయశీలు డనే ఈ యువకుడు, ఒకప్పుడు మన ఆస్థానంలో పనిచేసిన కులశేఖరుడి, ఒక్కగానొక్క కొడుకు. కులశేఖరుడు చనిపోయాడు. తమరు యితడి మీద కొంచెం కరుణ చూపాలి," అన్నాడు మంత్రి.

రాజు, జయశీలుణ్ణి ఆపాదమస్తకం ఒకసారి పరీక్షగా చూసి, జాలిపడుతున్నట్టు తలాడించి, "అయితే, యితడికి శిరశ్ఛేదం కాదు, దేశ బహిష్కరణ శిక్ష వేస్తున్నాను. ఏనాటికైనా దుర్వ్యసనాల నుంచి బయటపడి, సన్మార్గవర్తనుడై తిరిగి వస్తే, ఇతడికి, నా ఆస్థానంలో తండ్రిచేసిన ఉద్యోగం తప్పకలభిస్తుంది." అన్నాడు.

జయశీలుడు, యికపొమ్మని సెలవా— అన్నట్టు తల వంచాడు. మంత్రి అతడితో, "ఇక వెళ్ళు. మహారాజుగారు చెప్పిన మాటలు గుర్తుంచుకో," అన్నాడు.

జయశీలుడు, రాజుకు నమస్కరించి, వెనుదిరిగి కొంచెం దూరం పోగానే, రాజు అతణ్ణి పిలిచి, "ఇదుగో, ఆ కృపాణజిత్తు వదిలిపోయిన కత్తి తీసుకో. ఒక్క వారం

రోజుల లోపల, నా రాజ్య సరిహద్దులు దాటిపోవాలి, తెలిసిందా?'' అన్నాడు.

''చిత్తం, మహారాజా!'' అని జయశీలుడు కత్తి తీసుకుని బయలుదేరి వీధిలోకి వెళ్ళాడు. అతడికి దేశం వదిలి పోయేముందు, తన చిరకాల మిత్రుడైన దేవశర్మను ఒకసారి కలుసుకుని, వీడ్కోలు చెప్పి పోవాలని వుంది. ఆ కారణంవల్ల అతడు, జూదగృహంలో దేవశర్మను చూడవచ్చు ననుకుని అక్కడికి వెళ్ళాడు. జూదగృహం తలుపులు లోపల గడి పెట్టబడి వున్నాయి.

జయశీలుడు ఆశ్చర్యపోతూ, గట్టిగా తలుపులు తట్టి, ''ఎవరు లోపల? తలుపులు తెరవండి!'' అని కేక పెట్టాడు.

ఆ వెంటనే లోపలినుంచి ఒక కంఠస్వరం, ''ఇది జూద గృహం కాదు; ఆ పిలిచే దెవరు?'' అని ప్రశ్నించింది.

ఈ జవాబుకు జయశీలుడు మరింతగా ఆశ్చర్యపోతూ, ''నేను జూదరిని కాదు, ముందు తలుపులు తెరు!'' అన్నాడు తీవ్ర కంఠస్వరంతో.

ఆ వచ్చిన వాడెవడో రాజోద్యోగి అని జూదగృహ యజమాని నిలువెల్లా వణికిపోతూ తలుపులు తెరిచి, జయశీలుణ్ణి చూసి యీసడింపుగా, ''నువ్వు ధనంతో పాటు దృష్టి శ్రవణ శక్తుల్ని కూడా



పోగొట్టుకున్నావా? తలుపులు ఎందుకు మూశాననుకున్నావు?'' అన్నాడు.

జయశీలుడు చర్రున ఒర నుంచి కత్తి దూసి, ''జూదరుల రక్త మాంసాలు తిని బతికే నీవు, ఇంతలోనే పెద్దమనిషివయావంటే నమ్మశక్యం కాకుండా వున్నది. నేను ధనహీనుణ్ణయినా, ఖడ్గహీనుణ్ణి కాను. అట్టే ప్రగల్భాలు పలకక, నా మిత్రుడు దేవశర్మ లోపల వున్నాడో లేడో చెప్పు.'' అన్నాడు.

జూదగృహ యజమాని తళతళ మెరుస్తున్న జయశీలుడి చేతిలోని కత్తి కేసీ, కోపంతో ఎర్రబడిన అతడి ముఖం కేసీ ఓమారు చూసి, ఇతడు రెండు గంటల

కిందటి వ్యసనపరుడూ, నిర్భాగ్యుడూ అయిన జూదరి కాదని గ్రహించి, "అయ్యా, కోపగించకండి. చేసిన పాపాలకు ప్రాయశ్చిత్తం చేసుకునేందుగ్గాను, నా జూదగృహాన్ని మూసేశాను. ఇక నాకు రాజభటుల బాధ గాని, యమకింకరుల భయం గాని లేదు," అన్నాడు.

ఈసారి జయశీలుడు కోపంగా కత్తిని జూదగృహ యజమాని గుండెలకు అనించి, "ఒరే, పాపీ! నువ్వు అప్రస్తుత ప్రసంగం చాలా చేశావు. నేనడిగింది, నా మిత్రుడు దేవశర్మ లోపల వున్నాడా లేదా? అని. అర్థమైందా?" అన్నాడు.

"అయ్యా, కత్తిని ఒరలో పెట్టండి. వీరుడైనవాడు, మరొక వీరుడితో తలపడితే లోకం మెచ్చుతుంది గాని, నా బోటి వాణ్ణి తెగటార్చితే హర్షించదు!" అన్నాడు జూదగృహ యజమాని.

జయశీలుడు కత్తిని ఒరలో పెట్టి, జూదగృహ యజమాని కంఠం పట్టుకుని గట్టిగా కుదుపుతూ, "ఒరే, తిరిగి అధిక ప్రసంగం చేస్తున్నావు. నా మిత్రుడు దేవశర్మ ఇంట్లో వున్నాడా లేడా?" అని గద్దించి అడిగాడు.

"అయ్యా, చంపకండి. జూదగృహం మూతబడటం చూసి, మిగతా జూదరులతో పాటు, మీ మిత్రుడూ ఎటో వెళ్ళిపోయాడు," అన్నాడు జూదగృహయజమాని.

"అలా చెప్పావు, బావుంది!" అని జయశీలుడు, అక్కణ్ణించి బయలుదేరి వీధిలోకి వచ్చాడు.

ఇప్పుడతడికి దేశం వదిలిపోవటం తప్ప, మరో మార్గాంతరం లేదు. కాలం కలిసివస్తే, తనే నాటికైనా దేవశర్మను కలుసుకోవచ్చు! జయశీలుడు యిలా ఆలోచిస్తూ, నగరం వదిలి, అరణ్యమార్గాలు పట్టి నడవసాగాడు. ఇలా అతడు ఒక వారం రోజులపాటు ప్రయాణం చేసి, అరణ్యంలో దొరికిన పళ్ళూ కాయలూ తింటూ, ఒకనాటి సూర్యాస్తమయ వేళకు, మరొక దేశపు రాజధానీనగర పరిసరాలను చేరాడు. —(ఇంకావుంది)





# మారని మనిషి

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, అమోఘమైన నీ పట్టుదలను ఎట్టి పరిస్థితులలోనూ విడిచి పెట్టకు. ఎందుచేతనంటే, దివ్యమైన తపస్సు మానివేసిన విరూపాక్షుడు ఉన్నతమైన ఐహికభోగాలను కూడా దూరం చేసుకుని, అతి హీనమైన గృహస్థాశ్రమాన్ని చేపట్టాడు. శ్రమ తెలియకుండా నీకు అతనికథ చెబుతాను, విను," అంటూ ఇలా చెప్ప సాగాడు:

విరూపాక్షుడు వారణాసిలో ఉండిన ఒక యువకుడు. అతను మంచి రూపసి, కాని ఎటూ నా అన్నవారులేని అనాథ. అతనికి యౌవనంలోనే వైరాగ్యం కలిగి,

## బేతాళ కథలు



హిమాలయాలకు వెళ్ళి, తపస్సు చేసుకో సాగాడు.

అతను రెండేళ్ళపాటు కఠోరతపస్సు చేసిన అనంతరం ఒకనాడు ఒక గంధర్వుడు అతని వద్దకు వచ్చి, "విరూపాక్షా, ముక్తికోరి నువు ఇంత చిన్న వయస్సులోనే తపస్సు చెయ్యటం మెచ్చదగినదే, కాని మోక్షం కోరినవాడికి జ్ఞానం అవసరం. ముక్కు మూసుకుని యీ మారుమూల ప్రాంతాల కూర్చుంటే నీకు జ్ఞానం ఎలా వస్తుంది? కొంతకాలం పాటు దేశసంచారం చెయ్యి. ఆ తరవాత నీ సంకల్పం తప్పక ఫలిస్తుంది." అని అదృశ్యమయాడు.

వెంటనే విరూపాక్షుడు తపస్సుమాని, హిమాలయం నుంచి బయలుదేరి, దేశాటన ప్రారంభించాడు. అతను అనేక క్షేత్రాలనూ, తీర్థాలనూ, మహర్షులనూ చూశాడు. అనేకమంది ద్వారా బోధలు విన్నాడు; అలా తిరుగుతూ, తిరుగుతూ కొంత కాలానికి అవంతీనగరాన్ని చేరు కున్నాడు. అక్కడ అతనికి ఒక చక్కని ఉద్యానం కనిపించింది. ప్రయాణపు బడలికతో ఉన్న విరూపాక్షుడు ఆ ఉద్యానంలో ఒక చెట్టు నీడన పడుకుని, సుఖంగా నిద్రపోయాడు.

తిరిగి అతను నిద్రలేచేసరికి అతని ముందు కొందరు దాసీలు ఉన్నారు. వారి చేతుల్లోని పళ్ళాలలో చందనమూ, సుగంధలేపనాలూ, రకరకాలపళ్ళూ ఉన్నాయి. అతనులేచి కూర్చోగానే వాళ్ళు వాటిని అతని ముందుంచి, తమ వెంట తమ రాజకుమార్తె సన్నిధికి రమ్మని వేడుకున్నారు.

విరూపాక్షుడు అమిత ఆశ్చర్యంతో, "మీ రాజకుమార్తెకు నాతో ఏం పని?" అని అడిగాడు.

వాళ్ళు ఇలా చెప్పారు:

"మా రాజకుమార్తె మంచి చిత్రకారిణి. ఈ వనం ఆమెదే. ఆమె ఇటుగా విహారానికివచ్చి, నిద్రపోతున్న మిమ్మల్ని

చూసి, మీ చిత్తరువు చిత్రించాలని అభిలాషపడింది. అందుచేత, మీరు నిద్రలేవగానే మిమ్మల్ని తన వద్దకు తీసుకురమ్మని మమ్మల్ని పంపింది.''

విరూపాక్షుడు దాసీల వెంట రాజకుమార్తె మందిరానికి వెళ్ళాడు. రాజకుమార్తె అసాధారణసౌందర్యవతి. ఆమె అందం చూసి ఆశ్చర్యపడుతూ అతను ఆమెను సమీపించి, తాను ఎవరో ఆమెకు చెప్పుకున్నాడు.

తరవాత అతని అనుమతి తీసుకుని రాజకుమార్తె అతని చిత్తరువు ఎంతో సమర్థతతోనూ, శీఘ్రంగానూ చిత్రించింది. తన కోరికను అతను మన్నించినందుకు, ఆ రాత్రికి తమ అతిథిగా ఉండి పొమ్మని ఆమె అతన్ని కోరింది. అతను అందుకు సమ్మతించి, ఆ రాత్రి సుఖంగా భోజనం చేసి, అంతఃపురంలో హంసతూలికా తల్పం మీద పడుకుని నిద్రపోయాడు.

అప్పుడు విరూపాక్షుడికి కలలో గంధర్వుడు కనిపించి, ''విరూపాక్షా, నీ జీవితం ఇప్పుడు ఒక దరి చేరింది. శుభం! నీ అదృష్టం గొప్పది. నీకు ఈ రాజకుమార్తె కన్న మంచి అర్ధాంగి దొరకదు,'' అన్నాడు.

''ఏమిటి, స్వామీ, మీరు అనేది? నాకు మీ మాటలు అర్థం కాలేదు,'' అన్నాడు విరూపాక్షుడు అయోమయంగా.

''పిచ్చివాడా, రాజకుమార్తె నిన్ను ప్రేమిస్తున్నది. రేపు ఆమె తన తండ్రితో





నీ విషయం చెప్పి, నిన్ను వివాహమాడటానికి అయనను ఒప్పిస్తుంది. అందుకే ఆమె ఈ రాత్రి నిన్ను తన అతిథిగా ఉంచేసింది. నీకు కూడా ఆమె పట్ల మంచి అభిప్రాయమే కలిగింది గదా!'' అన్నాడు గంధర్వుడు, మాయమైపోతూ.

విరూపాక్షుడు చప్పున లేచి కూర్చున్నాడు. గంధర్వుడు కలలో చెప్పిన మాటలు అతని చెవిలో ఇంకా మారుమోగుతూనే ఉన్నాయి. అతను ఆ రాత్రికి రాత్రే అక్కడినుండి బయలుదేరి, మళ్ళీ ప్రయాణం సాగించాడు.

తెల్లవారేసరికి అతను ఒక చిన్న గ్రామం చేరుకున్నాడు. ఆ గ్రామం మొదట్లోనే అతనికి ఒక చిన్న కుటీరం కనిపించింది. దాని బయట ఒక వృద్ధురాలు కనిపించింది. విరూపాక్షుడు ఆమెను సమీపించి, ముఖం కడుక్కునేటందుకు నీరు ఇయ్యమని అడిగాడు.

ముసలిది లోపలికి తొంగిచూసి, ''సత్యవతీ, ఎవరో అతిథి వచ్చాడు, చెంబుతో నీరు పట్టుకురా!'' అని కేక పెట్టింది.

ఒక యువతి తడువుకుంటూ బయటికి వచ్చి, నీళ్ళ చెంబు కిందపెట్టి లోపలికి వెళ్ళిపోయింది.

విరూపాక్షుడు ముసలిదానితో, "అవ్వా, ఆమె నీ మనవరాలులాగున్నది. ఎందుకు అలా తడువుకుంటూ నడుస్తుంది?'' అన్నాడు.

''సత్యవతి పుట్టుగుడ్డిది, నాయనా! దాని తల్లీ, తండ్రీ పోయారు. దానికి ఇప్పుడు నేనే దిక్కు. నేను కూడా పోతే, దాని బ్రతుకు ఏమవుతుందో?'' అన్నది ముసలిది, కంటతడి పెట్టుకుంటూ.

తక్షణమే, విరూపాక్షుడు ఆ గుడ్డిదాన్ని పెళ్ళాడి, అక్కడే ఉండిపోవటానికి నిశ్చయించుకున్నాడు.

ఆ రాత్రి అతనికి కలలో మళ్ళీ గంధర్వుడు కనిపించాడు. విరూపాక్షుడు

గంధర్వుడితో, "స్వామీ, నేను సత్యవతిని పెళ్ళాడ నిశ్చయించుకున్నాను. మమ్మల్ని దీవించండి!" అన్నాడు.

గంధర్వుడు, "తథాస్తు!" అని అదృశ్యమయాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, నాకు కొన్ని సందేహాలున్నాయి. గంధర్వుడు విరూపాక్షుడి చేత తపస్సు మాన్పించి, దేశాటన ఎందుకు చేయించాడు? రాజకుమార్తెను పెళ్ళాడమని సలహా ఇచ్చిన ఆ గంధర్వుడే, కళ్ళులేని దాన్ని పెళ్ళాడతానని విరూపాక్షుడు అన్నప్పుడు ఎందుకు దీవించాడు? రాజకుమార్తె తనను పెళ్ళాడుతుందంటే బెదిరి పారిపోయిన విరూపాక్షుడు, ఏరికోరి గుడ్డిదాన్నీ, పేదదాన్నీ ఎందుకు పెళ్ళాడ నిశ్చయించాడు? అతనిలో కలిగిన ఈ మార్పుకు కారణం ఏమిటి? ఈ సందేహాలకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది." అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "విరూపాక్షుడికి తపస్సుచేసేటప్పుడు మనస్సులో ఏ కోరికాలేదు. అతను ఏ కర్మా చేయలేదు. కోరికలు లేకుండా కర్మను నిర్వర్తించిన వారికే మోక్షం సాధ్యమవుతుంది. గంధర్వుడు అతని కోరికలకు బాహ్యరూపంలాటివాడు. కోరికలు మోక్షానికి అనుకూలం కావచ్చు, కాకపోవచ్చు. విరూపాక్షుడు రాజకుమార్తెను పెళ్ళాడి ఉంటే మోక్షానికి దూరమయేవాడు. సత్యవతిని పెళ్ళాడటంలో అతనికి ఏ కోరికాలేదు. పైపెచ్చు సత్కర్మ చెయ్యటానికి అతనికి మంచి అవకాశం కూడా లభించింది. ఈ కారణం చేత విరూపాక్షుడిలో ఏ మార్పూ రాలేదనీ, కోరిక అనేది ఎదట కనిపించినప్పుడు కూడా దాన్ని జయించాడనీ చెప్పాలి." అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)



# మొక్కుబడి

కొత్తగా కాపరానికి వచ్చిన లవంగికి పుట్టింటి మీద బెంగ జాస్తిగా ఉండేది. ఆమె చీటికీమాటికీ పుట్టింటికి వెళ్ళి తల్లిని చూసివస్తూ ఉండేది. ఆ తల్లి కూడా లవంగికి తగ్గదే.

ఒకనాడు ఒక మనిషి వచ్చి లవంగితో, "మీ అమ్మగారి పరిస్థితి ఏమీ బాగాలేదు. నిన్ను వెంటనే బయలుదేరి రమ్మన్నారు," అన్నాడు. ఈ మాట వింటూనే లవంగి కట్టుబట్టలతో పుట్టింటికి బయలుదేరి వెళ్ళిపోయింది. ఆమె తమ కన్నవారి ఊరి కోవెల పక్కగా పోతూ, తన తల్లికి బాగయితే తన భర్త చేత ఆ కోవెల చుట్టూ నూరు పొర్లుదణ్ణాలు పెట్టిస్తానని మొక్కుకున్నది.

లవంగి తల్లి బావి దగ్గిర కాలు జారి పడితే తొంటి బెణికింది. మర్నాటికే ఆమె లేచి తిరిగింది. అయినా లవంగి ఇంటికి తిరిగి వచ్చి తన భర్తతో తన మొక్కు సంగతి చెప్పి, పొర్లుదణ్ణాలు పెట్టటానికి బయలుదేరమన్నది.

"నువ్వు కూడా రావాలి. నువ్వు మీ పుట్టింటికి వెళ్ళినప్పుడు నాకు జలుబు చేసింది. అది తగ్గితే దేవుడికి నిలువు దోపిడి నీ చేత ఇప్పిస్తానని మొక్కుకున్నాను," అన్నాడు భర్త.

లవంగి గుండె ఆగినంతపని అయింది. ఆమె తన మొక్కు సంగతి మళ్ళీ ఎత్తలేదు.

—ఎం. కామేశ్వరరావు





# రాజద్రోహి

ఒకరోజు శ్రీకృష్ణదేవరాయలు అర్ధరాత్రి దాకా రాజ్యాంగ విషయాలు చూసి, తన శయనమందిరం చేరుకున్నాడు. హంస తూలికాతల్పం మీద పరిచిన దుప్పటి కింద ఏదో కదులుతున్నట్టు అనుమానం కలిగి ఆ దుప్పటిని ఎత్తేసరికి, దాని కింద నుంచి ఒక కృష్ణసర్పం బుస్సుమంటూ బయటికి వచ్చింది. రాజు దాన్ని తన కరవాలంతో నరికేశాడు.

మర్నాడు రాయలు మహామంత్రి తిమ్మరుసుతో ఈ సంగతి చెప్పినప్పుడు, తిమ్మరుసు, "మిమ్మల్ని హత్య చెయ్యటానికే ఈ ప్రయత్నం జరిగింది, సందేహం లేదు. ఆ రాజద్రోహి ఎవ్వరో తెలుసుకున్నదాకా మీకు ప్రాణభయం ఉంటుంది." అన్నాడు.

"నా మీద ఎవ్వరికి అంత పగ వుంటుంది?" అని రాజు అడిగాడు.

"బిజాపూరు నుంచి మన నగరానికి రాయబారి వచ్చి ఇంకా వారంకూడా కాలేదు. అతని విషయంలో హెచ్చరికగా ఉండమని మన గూఢచారులు చెప్పారు. ద్రోహి పట్టుబడినదాకా మీరు భోజనం మొదలుకుని ప్రతి విషయంలోనూ ఎంతో మెలకువగా ఉండండి." అన్నాడు తిమ్మరుసు.

ఆ రోజు రాయలు తినడానికి పంపిన హల్వాలో విషం ఉన్నట్టు రుజువయింది. అందులో కొంచెం పిల్లికి వెయ్యగా పిల్లి దాన్ని తిని పడిపోయింది.

తిమ్మరుసు వంటవాణ్ణి పిలిపించి అడిగేసరికి, వాడు హల్వాలో విషం కలిపినట్టు ఒప్పుకున్నాడు. ఎవరో వ్యక్తి తనకు లక్షవరహాలు ఆశపెట్టి, తనచేత ఈ పని చేయించాడట. ముందుగా పది వేల వరహాలు ఇచ్చాడట. వంటవాడు

యం. వి. కె. మూర్తి

ఆ డబ్బు తెచ్చి రాయలుకు, తిమ్మరుసుకు చూపించాడు కూడా.

తిమ్మరుసు రాయలుతో, "రాజద్రోహిని ఈ రాత్రికి చెరలో ఉంచి, రేపు నిండు సభలో తగిన శిక్ష విధిస్తాం" అన్నాడు.

వంటవాడు రాజద్రోహం తలపెట్టిన వార్త నగరంలో కూడా తెలిసిపోయింది.

మర్నాడు తెల్లవారే సరికి తిమ్మరుసు ఒక వ్యక్తిని బంధించి రాయలు వద్దకు తెచ్చి, "మహారాజా, వీడే, మీ పక్కలో పామును పెట్టిన రాజద్రోహి," అన్నాడు.

ఆ మనిషి అంతఃపుర ద్వారపాలకుడు.

రాయలు వాణ్ణి చూసి ఆశ్చర్యపోయి, "మరి వంటవాడు? వాడు కాక వీడు మరొక రాజద్రోహి అన్నమాటా?" అని తిమ్మరుసును అడిగాడు.

తిమ్మరుసు నవ్వి, "వంటవాడు ఎర; వీడు చేప. వంటవాడు రాజద్రోహి కాడు. వాడు మీ కిచ్చిన హల్వాలో కలిపినది విషంకాదు, మత్తుమందు. అది తిన్న పిల్లి చావలేదు, ఇప్పుడు మత్తు వదిలి హాయిగా తిరుగుతున్నది. నేనే వంటవాడి ద్వారా ఈ నాటకం ఆడాను," అన్నాడు.

"మీరు ఈ నాటకం ఎందుకు ఆడవలసివచ్చింది?" అన్నాడు రాయలు.

దానికి తిమ్మరుసు ఇలా చెప్పాడు: "రాజద్రోహిగా మరొకడు పట్టుబడ్డా డనగానే అసలు రాజద్రోహికి తాను తప్పించుకున్నానన్న ధైర్యం వస్తుంది. అదీగాక తనకు లంచం ఇచ్చిన వాళ్ళే మరొకడికి లక్ష వరహాలు వాగ్దానం చేసినట్లు విని, తనకు కూడా అంత సొమ్ము ఇవ్వమని అడగటానికి తప్పక వెళతాడు. రాత్రి బిజాపూరు రాయబారి ఇంటి ప్రాంతంలో మన వేగులవాళ్ళను ఉంచి, అంతఃపుర పరిచారకులలో ఎవరు ఆ ఇంటికి వచ్చినా పట్టుకో మన్నాను. వీడు దొరికాడు."

తరువాత రాజద్రోహి విచారణ జరిగింది. వాడికి తగిన శిక్ష పడింది. రాయలు తన వంటవాణ్ణి తగిన విధంగా సత్కరించాడు. బిజాపూరు నుంచి వచ్చిన రాయబారిని తిప్పి పంపేశారు.



# లోసుగుబేరం

వ్యాపారంలోకి కొత్తగా ప్రవేశించిన ఒక మనిషి సంతలో 250 రూపాయలకు కందుల బస్తా కొనితెచ్చి, చిల్లర వర్తకులకు అమ్మజూపాడు. కాని ఎవ్వరూ అతనికి 260 కన్న ఎక్కువ ఇస్తామన లేదు. కనీసం 275 కన్నా అమ్మాలని కొత్త వ్యాపారి ఉద్దేశం.

ఇంతలో ఒక చిల్లరకొట్టువాడు ఆ కందులు కొనటానికి ఒప్పుకుని, మూడు వేళ్ళుచూపి, అన్ని వందలిస్తానన్నాడు. 50 రూపాయలు లాభం వస్తుందని నమ్మలేక కొత్తవ్యాపారి, ఏమిస్తావని మళ్ళీ అడిగాడు. మళ్ళీ దుకాణంవాడు మూడు వేళ్ళుచూపి అన్ని వందలిస్తానన్నాడు. తృప్తిపడి కొత్తవ్యాపారి కందులిచ్చాడు. దుకాణంవాడు 250 మాత్రమే చేతిలో పెట్టాడు.

కొత్తవ్యాపారి న్యాయాధికారి దగ్గిర ఫిర్యాదు చేశాడు. న్యాయాధికారి ఇద్దరినీ పిలిపించి అడిగితే, దుకాణంవాడు, "నేను నా మూడు వేళ్ళు అతనికి రెండుసార్లు చూపాను. చూడండి. నా చూపుడు వేలు సగమే ఉన్నది. నేను ఇస్తాన్నది, 250 మాత్రమే," అన్నాడు.

నాయ్యాధికారి మండిపడి, "నీ రెండున్నర వేళ్ళు రెండుసార్లు చూపానంటున్నావు కనక అతనికి 500 ఇయ్యి," అని తీర్పు చెప్పాడు. దుకాణంవాడు చెంపలు వేసుకుని కొత్తవ్యాపారికి 300 ఇచ్చుకున్నాడు.

—శింగిశెట్టి సంజీవరావు





# మహామాంత్రికుడు

చక్రధరపురరాజు కాంతిసేనుడు ఒక సారి ఒంటరిగా వేటకు వెళ్ళి, మధ్యాన్నానికి అలసిపోయి, తన గుర్రాన్ని ఒక చెట్టు నీడకు నడిపించాడు.

ఆ చెట్టు కింద ముగ్గురు మనుషులు దూర దూరంగా కూర్చుని ఉన్నారు. ఒకడు నిశ్చలంగా శూన్యంలోకి చూస్తున్నాడు. రెండోవాడు ఒంటి కంటితో చూస్తున్నాడు. మూడోవాడు చేతులు రెండూ చిత్రంగా మెలిపెట్టి, వెనక్కు పెట్టుకుని ఉన్నాడు. ముగ్గురూ రాజును చూసి చలించలేదు.

కాంతిసేనుడు దర్పంగా మొదటి వాడితో, "నా రాజ్యంలో ఉంటూ నా కిచ్చే మర్యాదఇదా? లేచినిలబడు!" అన్నాడు.

మొదటివాడు తన దృష్టి రాజు మీదికి తిప్పి చురచురా చూసి, మళ్ళీ శూన్యంలోకి చూడసాగాడు. రెండో, ఒంటి కంటి వాడు కాంతిసేనుడితో, "మహారాజా, ఆయనకు కోపం వచ్చిందంటే మీతో మాట్లాడుతాడు, జాగ్రత్త! ఆయన మాటలు విన్నవాళ్ళకు బ్రహ్మచెవుడు వస్తుంది," అన్నాడు.

ఈ మాట విని కాంతిసేనుడు భయపడి, వాడు మాట్లాడనందుకు ఎంతో సంతోషించి, ఒంటి కన్నువాడితో, "మరి నీ మర్యాద ఏమయింది?" అన్నాడు.

"నాకు కోపం వస్తే రెండో కన్ను తెరుస్తాను. ఆ కన్ను తెరిస్తే ఎదటి వాళ్ళ కళ్ళుపోతాయి," అన్నాడు ఒంటి కంటి వాడు చిరునవ్వు నవ్వుతూ.

కాంతిసేనుడు మూడోవాడి కేసి తిరిగి, "వాళ్ళిద్దరిలాగా నీకూ ఏవైనా అద్భుత శక్తులున్నాయా?" అని అడిగాడు.

"లేకేం? నేను చేతులెత్తి ఎవరికైనా దణ్ణం పెట్టానంటే వాళ్ళు పుచ్చుకాయ

మల్లవరపు మనోహరరెడ్డి

లాగా పగిలి చస్తారు.'' అన్నాడు చేతులు వెనక్కు పెట్టుకున్నవాడు.

అంతంత శక్తులు గలవాళ్ళ మధ్య ఉండటం మంచిది కాదనుకుని, కాంతి సేనుడు గుర్రాన్ని వెనక్కు మళ్ళించాడు. వెంటనే ఒంటి కంటివాడు, "మహారాజా, ఆగండి!'' అన్నాడు. వెనుక చేతులవాడు, ''ముందుకు వెళ్ళారంటే పుచ్చకాయలా పగులుతారు!'' అన్నాడు.

కాంతిసేనుడు గిరుక్కున వెనక్కు తిరిగి వచ్చి, '' మీ కేం కావాలో చెప్పి, నన్ను వదిలెయ్యండి.'' అన్నాడు.

''మేము మీతోపాటు నగరుకు వస్తాం,'' అన్నాడు ఒంటి కన్నువాడు.

కాంతి సేనుడు ఆశ్చర్యపడి,''దేనికి?'' అని అడిగాడు.

''అడ్డుప్రశ్నలు వేసి మాకు ఆగ్రహం తెప్పించకు, విన్నావా!'' అన్నాడు వెనుక చేతులవాడు.

కాంతిసేనుడు ఆ ముగ్గుర్నీ తన వెంట రాచనగరకు తీసుకుపోయి, వాళ్ళకు విడిది ఏర్పాటు చేశాడు. ఒంటి కంటి వాడు ఆయనతో, ''రేపు మీరు సభకు వెళ్ళేముందు మాకు కనిపించాలి,'' అన్నాడు.

కాంతిసేనుడి మంత్రి మాణిక్యశర్మ కుశాగ్రబుద్ధి. ఆయన ఇదంతా చూసి,



''ఏమిటి ఇదంతా? వాళ్ళు ఎవరు?'' అని రాజును అడిగాడు.

''వాళ్ళు అమోఘమైన శక్తులుగల వాళ్ళు. వాళ్ళను ఎదిరించేటందుకు లేదు. ఏమిచేయడం?'' అన్నాడు రాజు.

''వాళ్ళకు నిజంగా శక్తులున్నాయా, లేక మోసగిస్తున్నారా?'' అని మంత్రి రాజును అడిగాడు

రాజు విసుక్కుని, ''రాజులను ఎవరూ మోసగించటానికి ప్రయత్నించరు. వాళ్లు మోసగాళ్ళు కారని గట్టిగా చెప్పగలను,'' అన్నాడు. మంత్రి వాళ్ళకు విషం పెట్టి చంపిద్దామంటే రాజుకు కోపం వచ్చి, "అంత శక్తులున్నవాళ్ళు విషాన్ని పసిగట్ట



29



లేదా? మీరు పరిస్థితులు బాగా అర్థం చేసుకుని సలహా లివ్వడం నేర్చుకోండి!'' 'అని వెళ్ళిపోయాడు.

మర్నాడు రాజు సభకుపోతూ, ఒంటి కంటివాడి అజ్ఞప్రకారం, ఆ ముగ్గురూ ఉండే విడిదికి వెళ్ళాడు. ఒంటి కంటి వాడు రాజును చూసి, ''మహారాజా, ఈ రోజు నుంచి ఈ రాజ్యాన్ని మనం నలుగురమూ పరిపాలిస్తాం. మూడు రోజులు మేము ఒకరి తరవాత ఒకరు సభకు వెళ్ళుతాం. నాలుగో రోజు మీరు రండి!'' అన్నాడు.

కాంతిసేనుడు త్రుళ్ళిపడి, ''అసంభవం!'' అన్నాడు.

కాని ఒంటి కంటివాడు, ''మాకు ఆగ్రహం వచ్చిందంటే మీరూ, మీ ప్రజలూ ఏమవుతారో తెలుసుకుని మరీ మాట్లాడండి!'' అన్నాడు.

రాజు కంగారుపడి, ''సరే, మీయిష్టం. నాకు కావలసినది నారాజ్యమూ, ప్రజలూ క్షేమంగా ఉండటమే. ఈరోజే తగిన ఏర్పాట్లు చేస్తాను,'' అని, కొత్త ఏర్పాట్లు గురించి దండోరా వేయించి, తన మందిరంలో విచారంగా ఉండిపోయాడు.

మూడు రోజులూ గడిచాయి. నాలుగో రోజు కాంతిసేనుడూ, మాణిక్యశర్మా సభకు వెళ్ళారు. గడచిన మూడు రోజుల లోనూ ధనాగారం మూడు వంతులు ఖాళీ అయినట్టు కోశాధికారి మంత్రికి చెప్పాడు.

క్రిక్కిరిసి ఉన్న సభలో నుంచి ఒక యువకుడు ముగ్గురు మనుషులను వెంట బెట్టుకుని రాజు వద్దకు వచ్చాడు. వారిలో ఒకడికి ఒక కన్ను లేదు. మరొకడికి రెండు చేతులూ లేవు. ఏమి జరిగినదీ ఆ యువకుడు రాజుకు విన్నవించాడు.

మొదటి రోజు పాలించినవాడు రాజ్యంలో ఎవరూ మాట్లాడరాదని శాసించాడట; యువకుడి వెంట ఉన్న ముగ్గురిలో ఒకడు నోరుజారి మాట్లాడే సరికి, వాడి నాలుక కోయించేశాడు. రెండో రోజు పాలించినవాడు ప్రజలందరూ ఒంటి

కన్నుతోనే చూడాలని ప్రకటించి. పొర పాటున రెండు కళ్ళతో చూసిన వాడి కన్ను పొడిపించాడు. మూడో రోజు పాలించినవాడు ప్రజలందరూ చేతులు వెనక్కు పెట్టుకోవాలని శాసించి, అలా చెయ్యని అభాగ్యుడి చేతులు నరికించాడు.

కాంతిసేనుడు ఆ యువకుడితో ఏమీ అనలేక, కంట తడిపెట్టుకుని, సభనుంచి లేచి వెళ్ళిపోయాడు. తరవాత ప్రజలు మంత్రిని కలుసుకుని, తమ కష్టాలు చెప్పు కుని, తమకు విముక్తి కలిగేమార్గం చూడమని వేడుకున్నారు.

మంత్రి రోజల్లా ఆలోచించగా ఆ రాత్రి ఆయనకు ఒక పాతవిషయం గుర్తుకు వచ్చింది. చక్రధరపురానికి తూర్పున ఒక కొండ ఉన్నది. ఆ కొండలో ఒక లోతైన గుహ ఉన్నది. ఆ గుహలో కొన్ని వందల ఏళ్ళక్రితం ఒక మహామాంత్రి కుడు ఉండేవాడట. ఆ మాంత్రికుడు అదృశ్యంగా ఇంకా ఆ గుహలో ఉన్నాడనీ, నరబలి ఇచ్చిన వాళ్ళకు ప్రత్యక్షమై, కోరిన కోరిక తీర్చుతాడనీ జనంలో నమ్మకం ఉన్నది.

మర్నాడు మంత్రి రాజును కలుసు కుని, మహామాంత్రికుడి సంగతి గుర్తు చేసి, అతని సహాయంతో దుర్మార్గుల పీడ విరగడ చేసుకుందామన్నాడు.



"నిజమే. కాని నరబలి మాటేమిటి? మనం మహామాంత్రికుడి సహాయం కోరు తున్నామని తెలిస్తే వీళ్ళతో ప్రమాదం గద!" అన్నాడు రాజు.

"నరబలి విషయం మీరు ఆలోచించ నవసరం లేదు. పోతే, వీళ్ళకు భయపడి మనం ఏమీ చెయ్యకపోతే అదీ ప్రమాదమే. బయలుదేరండి," అన్నాడు మంత్రి.

ఇద్దరూ కొండ గుహ వద్దకు వెళ్ళారు. రాజును గుహ బయట ఉంచి, మంత్రి గాఢాంధకారపు గుహలోకి వెళ్ళి, "మహారాజా, ప్రజల కోసం నేను బలి అయిపోతున్నాను," అని కేక పెట్టాడు. తరవాత ఒక చావుకేక వినిపించింది.

రాజు జరిగిన దానికి స్తంభించిపోయి చూస్తూండగానే, వికటాట్టహాసం చేస్తూ, మంత్ర దండాన్ని గిర్రున తిప్పుతూ, మహామాంత్రికుడు గుహలో నుంచి వచ్చాడు. అతడి గడ్డం తెల్లగా, మూరెడు పొడుగున్నది. అతడి శిగలో పుర్రె ఉన్నది; పైనుంచి కిందిదాకా కాషాయ రంగుగల అంగరఖా ధరించి ఉన్నాడు.

"నీ కష్టం నాకు తెలుసులే. పద పోదాం," అన్నాడు మహామాంత్రికుడు.

ఇద్దరూ సభకు వచ్చేసరికి ఒంటి కంటివాడు సింహాసనం మీద ఉన్నాడు. మాంత్రికుడు వికటాట్ట హాసం చేసి, మంత్ర దండంతో వాడి నెత్తిన కొట్టి, "వీడి శక్తి పోయింది. వీణ్ణి చంపెయ్యండి," అన్నాడు. ప్రజలు వాడి మీద పడ్డారు.

మాంత్రికుడు ఆ పక్కనే ఉన్న మిగిలిన ఇద్దరి నెత్తిమీదా కొట్టి, వాళ్లను ప్రజల్లోకి నెట్టాడు. ప్రజలు ముగ్గురి ప్రాణాలూ తీసేశారు. ప్రజలకూ, రాజుకూ ఎంతో ఆనందమయింది.

అయితే అదే క్షణంలో, తన మంత్రి ప్రజల కోసం ఆత్మార్పణ చేసుకున్నాడన్న మాట గుర్తుకు వచ్చి, కాంతిసేనుడికి దుఃఖం ఆగలేదు.

అది చూసి మహామాంత్రికుడు, "మహారాజా, మీ మూఢనమ్మకాల మూలానే ఇంత జరిగింది. నిజానికి వీళ్ళకు ఏ శక్తులూ లేవు. ఒకడు మూగవాడు, ఒకడు గుడ్డివాడు, ఒకడు అవిటివాడు. వీళ్ళు తెలివిగా మిమ్మల్ని భయపెట్టి, కీలుబొమ్మను చేసి ఆడించారు. ఇది నేను మొదటనే అనుమానించాను, అయితే మీరు నాతో ఏకీభవించలేదు. అందుచేత ఈ మాంత్రికుడి పాత్ర అభినయించాను," అంటూ వేషం విప్పి, మంత్రిగా ప్రత్యక్షమయ్యాడు.

రాజు అతన్ని ఆనందంతో కౌగలించుకున్నాడు. ప్రజలు హర్షధ్వానాలు చేశారు. తరవాత ఆ ముగ్గురు మోసకారుల విడిదిలో వెతకగా, ఖజానాలో తరిగిన ధనం దొరికింది.



# భక్తిలో తేడా

ఒకఊళ్ళో కమలా, వాణి అనే ఇద్దరు ఇరుగు పొరుగు ఇల్లాళ్ళు, ఐశ్వర్యం కోరి లక్ష్మిపూజ చేసేవారు. కమల బీదది, వాణి శ్రీమంతురాలు.

ఒక శుక్రవారంనాడు లక్ష్మిదేవి తన భక్తురాళ్ళను అనుగ్రహించటానికి సన్యాసిని రూపంలో వచ్చింది. ఆమె మొదట, శ్రీమంతురాలైన వాణి ఆతిథ్యం పొంది, తన జోలెనుంచి ఒక రుద్రాక్ష తీసి, "దీన్ని పూజిస్తూవుంటే, వారం వారమూ నీ ఇంట ఐశ్వర్యం పెరుగుతుంది," అన్నది.

వాణి దాన్ని పుచ్చుకుని, "నేను ఇప్పుడు లక్ష్మిపూజకు పది రూపాయలు ఖర్చు చేస్తున్నాను. ఐశ్వర్యం పెరిగిన కొద్దీ ఇంకా హెచ్చు ఖర్చుచేస్తాను," అన్నది.

లక్ష్మిదేవి అలాగే కమల ఇంటికి కూడా వెళ్ళి, ఆమె ఇచ్చిన ఆతిథ్యం స్వీకరించి, రుద్రాక్ష ఇస్తూ, వాణితో చెప్పినట్లే చెప్పింది.

"నాకు రుద్రాక్ష వద్దమ్మా! నేను ఐశ్వర్యం కోసం లక్ష్మిదేవినే నమ్ముకొని ఉన్నాను. నా పేద ఆతిథ్యానికి సంతోషించావు, అంతే చాలు." అన్నది కమల.

తరవాత కమల ఇల్లు ఐశ్వర్యంతో నిండి పోయింది.





# పాపిష్ఠి సొమ్ము

ఒక ఊళ్ళో శాంతమ్మ అనే పిసినారి ముసలిది ఉండేది. ఆమె దగ్గర పుష్కలంగా డబ్బు ఉన్నా, తన కడుపుకు కూడా ఇంత తినేదికాదు. ఇతరులకు పెట్టడం మాట అటుంచి, చేతిలో దుడ్డుకర్ర ఆడిస్తూ, కాకులను, పిచ్చుకలను కూడా ఇంటి మీద వాల నిచ్చేది కాదు. ఆమెను చూస్తేనే అవి పారి పోయేవి. ఆమె తన వెండి, బంగారాలను ఒక బిందె నిండా నింపి, ఆ బిందెను నట్టింట పూడ్చిపెట్టి, దాని మీద చింకిచాప పరిచి, దాని మీదనే పడుకునేది. దాని మీదనే కూర్చునేది. ఆమెను అందరూ పెడగానే ఉంచేవారు.

ఒకసారి ఆ ఊరికి ఒక జ్యోతిష్కుడు వచ్చి, శాంతమ్మ ఇంటి ముందు ఉండే ఒక పెద్దచెట్టు నీడన కూర్చుని, ఊళ్ళో వాళ్ళకు జోస్యం చెబుదామనుకున్నాడు. దారేపొయ్యే వాళ్ళు అతని కేసి వింతగా చూస్తూపోయారే గాని, ఒక్కరూ అతని వద్దకు రాలేదు. కారణమేమిటా అని అతను ఆశ్చర్యపడుతూండగా, అతని నెత్తిన బలంగా దెబ్బ పడింది. వెనక్కు తిరిగి చూసేసరికి, శాంతమ్మ మరొక దెబ్బ కొట్టటానికి కర్ర ఎత్తి, "జంఝం వెధవా! నా చెట్టు నీడన కూర్చుంటావా?" అన్నది.

జ్యోతిష్కుడు చప్పున తన సరంజామా చంకన పెట్టుకుని కాలిసత్తువకొద్దీ పారిపోయి, ఊళ్ళో వాళ్ళ నుంచి శాంతమ్మను గురించి వివరంగా తెలుసుకున్నాడు. ఆమె మూర్ఖత్వానికి కారణం అమాయికత్వమేననీ, ఊరి వాళ్ళు ఆమెను పురుగును చూసినట్లు చూడటం అన్యాయమనీ, ఆమె తత్వం మార్చవచ్చుననీ అతనికి తోచింది.

బూర్లె నాగేశ్వరరావు

అదే రోజు అర్ధరాత్రి శాంతమ్మ ఇంటి ముందు ఒక విచిత్రం జరిగింది. నిలువునా నల్లని ముసుగు ధరించిన ఒక ఆకారం, తొమ్మిది కుండల దొంతర నెత్తిన పెట్టుకుని, అవి కింద పడకుండా వింత నృత్యం చెయ్యసాగింది. పగలంతా నిద్రపోయి, తెల్లవార్లూ మేలుకునే శాంతమ్మ గజ్జల చప్పుడు విని, దుడ్డుకర్ర తీసుకుని, తలుపు తీసి, ఎదురుగా నృత్యం చేసే పిశాచంలాంటి అవతారాన్ని చూసి వణికిపోయింది. శాంతమ్మ చేతిలో కర్ర కింద పడిపోయింది. ఆమె చప్పున తలుపు మూసి, కంతలో నుంచి చూసింది. పిశాచం నెత్తి మీద తొమ్మిది కుండలున్నాయి. పైకుండ మీద దీపం వెలుగుతూ ఉన్నది.



పిశాచం కొంచెంసేపు నృత్యం చేసి, దీపంగల పై కుండను కింద పడేసి, మిగిలిన ఎనిమిది కుండలతో సహా వెనక్కు తిరిగి చూడకుండా వెళ్ళిపోయింది. శాంతమ్మ తలుపు తీసి చూస్తే పగిలిన కుండ పెంకులు తప్ప ఏమీ కనిపించలేదు. ఇంకా భయం వదలక ఆమె, ''నా యింటికి పిశాచం వచ్చిందర్రో! దయ్యంవచ్చిందర్రో!" అని కేకలుపెట్టింది. ఆ కేకలను ఎవ్వరూ పట్టించుకోలేదు.

మర్నాడు ఆమె, రాత్రి జరిగిన సంఘటనకు అర్థం ఏమిటని, చాలామందిని అడిగింది. ఎవరూ ఆమెను లక్ష్యపెట్టలేదు. మర్నాడు రాత్రి ఆమె తలుపు గడియపెట్టి ఒక చీపిరి కట్టా, పాత చేటా దగ్గిర పెట్టుకుని, దుడ్డుకర్ర కూడా అందుబాటులో ఉంచుకున్నది. అర్ధరాత్రి మళ్ళీ గజ్జెల మోత వినిపించింది. ఆమె తలుపు కన్నంలో నుంచి చూస్తే, ఈ సారి పిశాచం నెత్తిన ఎనిమిది కుండలే ఉన్నాయి; ఎనిమిదో కుండ మీద దీపం వెలుగు తున్నది. పిశాచం కొంతసేపు నృత్యం చేసి, పై కుండ కింద పడేసి, ఏడు కుండలతో వెళ్ళిపోయింది.

మరి రెండు రోజులు గడిచాయి. రోజూ అర్ధ రాత్రి వేళ పిశాచం వస్తూనే

ఉన్నది; నృతంచేసి ఒక కుండను పగలగొట్టి, మిగిలిన కుండలతో తిరిగి వెళ్ళుతున్నది. నాలుగు డబ్బులు ఖర్చయినా సరే ఈ పిశాచాన్ని వదిలించుకోవాలని, శాంతమ్మ భూతాల పేరయ్యా ఇంటికి వెళ్ళింది. పేరయ్యా అంతటి వాడే శాంతమ్మను చూడగానే అదిరి పడి, తలుపు గడియపెట్టుకున్నాడు. శాంతమ్మ చాకలి ఇంటికీ, మంగలి ఇంటికీ, శాస్త్రుల ఇంటికీ వెళ్ళింది. కాని ఎవ్వరూ ఆమెను లోనికి రానియ్యలేదు. ఊరి వాళ్ళకు తనను గురించి ఎలాటి వైఖరి ఉన్నదీ ఆమె కొద్దిగా గ్రహించింది.

ఆమె నిరాశతో ఇంటికి వస్తూండగా ఒక చోట జనం పోగై ఉండటం కనిపించింది. వాళ్ళమాటలను బట్టి, ఎవ్వరో కొత్తగా వచ్చి గొప్పగా జోస్యం చెబుతున్నట్టు ఆమెకు తెలిసింది. శాంతమ్మ తిన్నగా జ్యోతిష్కుడి వద్దకు వెళ్ళింది.

జ్యోతిష్కుణ్ణి చూడగానే శాంతమ్మ చేతులు చాచి, "అయ్యో, నువ్వేనా, జంఝుం సామీ!" అన్నది. జ్యోతిష్కుడు అందరిపనీ చూసినాక శాంతమ్మ కేసి తిరిగి, "ఏం కావాలి?" అని అడిగాడు.

"నన్ను మీరు ఒక పిశాచం బారి నుంచి రక్షించాలి," అన్నది శాంతమ్మ. ఆమె జ్యోతిష్కుడికి జరిగినదంతా చెప్పి, "ఇప్పుడు పిశాచం నెత్తిమీద అయిదు కుండలే ఉన్నాయి. దానికి అర్థమేమిటి?" అని అడిగింది.



జ్యోతిష్కుడు కొంచెం సేపు ఆలో ఛించి, తల అడ్డంగా తిప్పి, "లాభం లేదు. శాంతమ్మా! ఇవి నీకు చివరి రోజులు. కారణం ఏమంటే, వారం రోజుల క్రితమే పిశాచాల పెద్ద చచ్చి పోయింది. ప్రస్తుతం పిశాచాలు దిక్కు లేనివి అయాయి. తన అనంతరం పిశా చాలను అదుపులో పెట్టగల దానివి నువ్వే నని పిశాచాల పెద్ద చచ్చిపోతూ చెప్పిం దట. అందుచేత అవి నీ కోసం ఆత్రంగా ఎదురు చూస్తున్నాయి. నువు ఎప్పుడో తాపీగా చచ్చి పిశాచ మవుతానంటే వాటికి ఎలా కుదురుతుంది? అందుచేత నిన్ను త్వరగా తీసుకు పోవటానికి అవి ప్రయిత్నిస్తున్నాయి. ఆ మిగిలిన అయిదు కుండలూ పడిపోగానే నువు పిశాచాల పెద్దవు అవుతావు!" అన్నాడు.

శాంతమ్మ కెవ్వున అరిచి, "బాబోయ్, నా కున్నదంతా నీకు ధారపోస్తా! నన్ను పిశాచాలు తీసుకు పోకుండా చూడు! ఆ అయిదు కుండలూ నా యింటి ముందు పగలకుండా చెయ్యి," అన్నది.

"అయితే, నీకు పిశాచాల పెద్ద కావటం ఇష్టం లేదా ఏమిటి? అలా కాకుండా ఉండాలంటే, నువ్వన్నట్టు నీ పాపిష్టి డబ్బు ధారపోయాలి. అన్న దానాలూ, పూజలూ పునస్కారాలూ చెయ్యి," అన్నాడు జ్యోతిష్కుడు.

ఆ రోజు శాంతమ్మ బిచ్చగాళ్ళకు దాన ధర్మాలు చేద్దామను కున్నది. బిచ్చ



గాళ్ళెవ్వరూ ఆమె ఇంటి కేసి రారు; దూరాన కనిపించిన వాళ్ళను ఆమె పిలిస్తే వాళ్ళు పారిపోయారు.

చీకటి పడుతున్నది. శాంతమ్మ కుక్కలకూ, కాకులకూ అన్నం వేసింది. కాని అవి శాంతమ్మను చూడగానే లేచిపోయాయి.

రాత్రి శాంతమ్మ ఇంటి ముందు మరొక కుండ పగిలింది. ఇంక నాలుగు కుండలే ఉన్నాయి.

తెల్లవారుతూనే శాంతమ్మ జ్యోతిష్కుడి దగ్గిరికి వెళ్ళి, ''అయ్యా, నాది పాపిష్ఠి సొమ్మే. నా చేతి అన్నం కుక్కలు కూడా ముట్టడం లేదు. నాకు చావు తప్పదా?'' అని అడిగింది.

''అవును, తల్లీ! మానవత్వం చంపుకుని డబ్బు కూడబెట్టావు. నీలో మానవత్వం లేదని పశువులకూ, పక్షులకూ కూడా తెలిసి పోయింది. నువు డబ్బు మంచి నీళ్ళలాగా ఖర్చుచేసి, నలుగురికీ మేలు చేయాలి. దేవాలయం కట్టించి, పూజలూ, ఉత్సవాలూ జరిపించు. ఒక మంచి నీటి బావి తవ్వించు. కుంటీ, గుడ్డీ తలదాచుకునే టందుకు సత్రం కట్టించు. ఆకలితో అలమటించే వాళ్ళకు అన్న దానాలు చేయించు. అలా చేస్తే నీ ఆయుస్సు పెరగటమే గాక, నలుగురిలోనూ ఎంతో మంచి పేరు వస్తుంది. అప్పుడు పిశాచాలు నీ చాయలకు రాలేవు,'' అన్నాడు జ్యోతిష్కుడు.

శాంతమ్మ అయనతో, ''నా చేతి మీదుగా ఎవరూ ఏమీ పుచ్చుకోరు. మీరే నా ఇంటికి వచ్చి, మీ చేతి మీదుగానే అన్నీ జరిపించండి,'' అన్నది.

ఇద్దరూ ఆమె ఇంటికి వెళ్ళారు. వెండి బంగారాలు నింపిన బిందెను శాంతమ్మ తవ్వి తీసి, జ్యోతిష్కుడికి ఇచ్చింది. త్వరలోనే ఒక సత్రమూ, దేవాలయమూ తయారయాయి. దేవాలయంలో గొప్పగా ఉత్సవాలు జరిగాయి. శాంతమ్మ ఇంకో జన్మ ఎత్తింది. పాత శాంతమ్మను అందరూ మరిచిపోయారు.





# సహాయం

ఒక దొంగ తాను దొంగిలించిన ధనాన్ని ఊరి బయట శ్మశానంలో ఒక చెట్టు దగ్గిర పాతిపెడుతూ రాసాగాడు. ఇలా రెండు మూడు సార్లు జరిగినాక, చెట్టు మీద ఉండే పిశాచం దొంగను చూసి జాలిపడి, "పాపం, ఈ మనిషి కష్టపడి దాచుకున్న ధనం ఎవరికీ అంద కూడదు," అనుకుని, దారికి అడ్డంగా రాళ్ళగుట్టలు వేసింది.

ఒకనాడు ఆ దారివెంబడి ఒక మునీశ్వరుడు వచ్చాడు. ఆయన తీర్థయాత్రలు చేస్తున్నాడు రాత్రివేళ ఊళ్ళలో బస చేయడు, శ్మశానంలో సమాధిలో ఉంటాడు. ఆయన దారికి అడ్డంగా ఉన్న రాళ్ళ గుట్టలను చూసి, "ఈ పని ఏ పిశాచం చేసింది?" అంటూ కళ్ళెర్ర చేశాడు.

చెట్టు మీద ఉన్న పిశాచం అదృశ్యంగానే ఉండి, "నేనేలే! వెనక్కు వెళ్లు. ఇటుగా దారిలేదు," అన్నది.

"నీకు అంత పొగరా! నన్నే పొమ్మంటావా? ఆ చెట్టుకు అలాగే అంటుకుపో!" అన్నాడు ముని.

పిశాచం భయపడిపోయి, లబోదిబోమంటూ, శాపం ఉపసంహరించమని మునిని వేడుకున్నది.

"ఈ రాళ్ళన్నీ తొలగి, వెనకటి మాదిరిగా దారి ఏర్పడితే గాని నీకు శాపవిమోచనం లేదు!" అంటూ ముని చుట్టు దారిన శ్మశానంలోకి వెళ్ళిపోయాడు.

"చెట్టుకు అంటుకుపోయిన నేను ఆ పని ఎలా చెయ్యను?" అని పిశాచం గోలపెట్టింది, ముని వినిపించుకో లేదు.

అది మొదలు ఆ పిశాచం, కనుచూపు మేరలో మనిషి కనిపించగానే, రమ్మని గట్టిగా కేకపెట్టేది. ఆ కేక విన్న వాళ్ళు అటునుంచి అటే పారిపోయేవాళ్లు. నాలుగో సారి ధనం తెచ్చి, దాచుకుందా

సి. హెచ్. వామనరావు

మనుకున్న దొంగ కూడా పిశాచం పిలుపు విని పారిపోయాడు.

ఒక్కసారి మాత్రం ఒక దరిద్రుడు ధైర్యంగా, "ఎవరా పిలిచేది? ఎందుకు పిలిచావు ?" అంటూ దగ్గిరికి వచ్చాడు.

"నే నెవరైతే నేం? ఇక్కడున్న రాళ్ళగుట్టల్ని తీసేయాలి. బండికి నూరు వరహాలు ఇస్తాను," అన్నది పిశాచం.

దరిద్రుడు సంతోషపడి, బండి తెచ్చి, రోజూ రాళ్ళను బండిలో తీసుకుపోయి, దూరంగా ఉన్న మైదానంలో కుమ్మరించి, ఇరవైదఫాలుగా రాళ్ళగుట్టలన్నీ తీసేశాడు.

"ఫలాని చోట తవ్వి, నీకు రావలిసిన రెండువేల వరహాలూ తీసుకో. మిగిలిన ధనం తాకకు. మళ్ళీ ఇటురాకు," అన్నది పిశాచం. దానికి తిరిగి స్వేచ్ఛవచ్చింది. బీదవాడు రెండువేల వరహాలూ తవ్వి తీసుకుని వెళ్ళి, సుఖంగా బతికాడు.

"పిచ్చిముని ఏం శాపం ఇచ్చాడు! అవలీలగా బయటపడ్డాను," అనుకుని పిశాచం, మళ్ళీ రాళ్ళు తెచ్చి దారికి అడ్డంగా గుట్టలు వేసింది.

తీర్థయాత్రల నుంచి అటుగా తిరిగి వస్తూ ముని, "ఇంకా చెట్టుకు అంటుకునే ఉన్నావా, పిశాచమా ?" అని అడిగాడు.

"లేదు. కాస్త డబ్బు పారేస్తే నీ శాపం ఇట్టేపోయింది. మళ్ళీ రాళ్ళగుట్టలు వేశానులే !" అన్నది పిశాచం.

"అలాగా? అయితే ఈ రాళ్ళగుట్టలతో దేవాలయం కట్టినదాకా, ఆ చెట్టుకు అంటుకుపోయే ఉండు," అని ఆ ముని వెళ్ళిపోయాడు.

మళ్ళీ పిశాచం కనిపించిన వాళ్ళనందరినీ పిలవసాగింది. కాని ఎవరూ రాలేదు. ఈ సంగతి తెలిసి, ధనికుడైన దరిద్రుడు వచ్చి, రాళ్ళగుట్టలను మళ్ళీ మైదానం మీదికి తరలించి, పాతిపెట్టి ఉన్న ధనంతో అక్కడ ఒక దేవాలయం కట్టించాడు. దేవాలయం పని పూర్తి కాగానే పిశాచానికి తిరిగి స్వేచ్ఛ లభించింది.



# భగవదనుగ్రహం

మాధవయ్య అనే చిన్న వ్యాపారి చనిపోతూ, తన వ్యాపారాన్ని పెద్ద కొడుకైన భద్రయ్యకు అప్పజెప్పాడు. భద్రయ్యకు దరిద్రమంటే తగని భయం. అతను అందుకే పెళ్ళి చేసుకోలేదు; కడుపునిండా తినేవాడు కూడా కాదు. అతని తమ్ముడు గోపయ్యకు సుఖంగా బతకాలని ఉండేది, కాని అన్న పెత్తనం కావటంచేత కిక్కురు మనకుండా ఉండేవాడు.

తాను ఎంత జాగ్రత్తగా ఉన్నా తన సంపద పెరగకపోవటమూ, తన ఊళ్ళోనే ఉన్న విష్ణువర్మ అనే వ్యాపారి దానధర్మాలతో, విలాసాలతో ఎంత ఖర్చుచేస్తున్నా అతడి సంపద పెరుగుతూండటమూ చూసి, భద్రయ్య విష్ణువర్మను కారణం అడిగాడు. "అంతా భగవదనుగ్రహం!" అన్నాడు విష్ణువర్మ.

ఆ మాటవిని భద్రయ్య తన ఇంట్లో దేవుడికి పూజచేసి, ఐదుపైసలు దేవుడి ముందు పెట్టాడు. మర్నాటికి ఐదుపైసల స్థానంలో పదిపైసలు ఉన్నవి. ఆ మర్నాడు పదిపైసలు పెట్టితే అది ఇరవై పైసలయింది. భగవంతుడు తనను ఎలా అనుగ్రహిస్తున్నాడో తమ్ముడికి ప్రత్యక్షంగా చూపాడు, భద్రయ్య. తమ్ముడు నవ్వుకున్నాడు. చిన్న చిన్న మొత్తాలు రెట్టింపు కావటంచూసి, ఒక నాడు భద్రయ్య తన దగ్గిర ఉన్న డబ్బంతా దేవుడి ముందు పెట్టాడు.

మర్నాడు చూస్తే దేవుడి ముందు డబ్బూ లేదు, తమ్ముడు గోపయ్యా లేదు.

—అమ్మాజీ





# చెప్పిచ్చిన విద్య

ఒక ఊళ్ళో ఒక యువకుడు ఉండేవాడు. వాడికి ఎవరి నుంచి అయినా గొప్ప విషయాలు తెలుసుకుని జ్ఞాని అయిపోవాలని ఉండేది. ఒకసారి వాళ్ళ ఊరికి ఒక సాధువు వచ్చాడు. ఆ అబ్బాయి ఆయన వద్దకు వెళ్ళి, ''స్వామీ, నాకు జ్ఞానోపదేశం చేసి జ్ఞానినిచెయ్యండి,'' అన్నాడు.

సాధువు నవ్వి, ''పిచ్చివాడా, చెప్పిచ్చిన విద్యా, కట్టిచ్చిన మూటా ఎంతో దూరం రావని వినలేదా? నోటి మాటల జ్ఞానం తెలియనివాళ్ళు ఎవరు? అంత మాత్రాన అందరూ జ్ఞానులైపోయారా?'' అన్నాడు.

ఆ అబ్బాయి, ''స్వామీ, మీరు చెప్పేది నాకు అర్థం కాలేదు,'' అన్నాడు.

''నేనీ ప్రాంతాల రెండు రోజులు ఉంటాను. ఆ రెండు రోజులూ నా వెంట తిరుగు. అప్పుడు నీకు నా మాట అర్థం కావచ్చు,'' అన్నాడు సాధువు.

ఆ అబ్బాయి ఆ రోజంతా సాధువు వెంట తిరిగాడు. ఆ రాత్రి ఇద్దరూ ఒక అరుగు మీద పడుకున్నారు. అది ఒక దొంగవాడి ఇల్లు. ఆ రోజు రాత్రి తండ్రి దొంగతనానికి బయలుదేరబోతూ ఉంటే దొంగవాడి కొడుకు, ''నాన్నా, నాక్కూడా దొంగతనం చేసే విద్య చెప్పమంటే చెప్పకుండా ఉన్నావు. నాకు దొంగకావాలని ఉన్నది,'' అన్నాడు.

''ఒరే, చెప్పిచ్చిన విద్యా, కట్టిచ్చిన మూటా ఎంత దూరం వస్తాయిరా? దొంగవి కావాలని ఉంటే నీ బుద్ధి ఉపయోగించి, అనుభవం ద్వారా దొంగవి కావాలి,'' అన్నాడు తండ్రి.

''అయితే ఈ రోజు దొంగతనానికి నీ వెంట రానీ,'' అన్నాడు కొడుకు.

ముళ్ళపూడి శ్రీమన్నారాయణమూర్తి

తండ్రి సరేనన్నాడు. ఇద్దరూ కలసి దొంగ తనానికి బయలుదేరారు.

ఇదంతా విన్న అబ్బాయి సాధువుతో, ''స్వామీ, మీరు చెప్పిన మాటే ఈ దొంగ కూడా చెబుతున్నాడు. ఏమి జరుగు తుందో చూసి వస్తాను. తమరు యిక్కడే వుంటారుగదా,'' అని తాను కూడా దొంగ వెనకగా బయలుదేరాడు.

దొంగ లిద్దరూ ఒక ధనికుడి ఇంటికి వెళ్ళారు. తండ్రి గోడలో కన్నం తవ్వి, కొడుకుతో, ''లోపలికి వెళ్ళు. మధ్య గదిలో భోషాణం ఉన్నది. ఈ మారు తాళం చెవితో దాని తలుపు తెరిచి, నీకు సాధ్యమైనంత బంగారమూ, వెండీ తీసు కురా,'' అన్నాడు.

తండ్రి ఇచ్చిన తాళం చెవితో కుర్ర వాడు లోపల ప్రవేశించాడు. మధ్య గదికి వెళ్ళి, తాళంచెవితో భోషాణం తలుపు తెరిచి లోపలికి వెళ్ళి, తలుపు మూశాడు. తలుపు మూసేటప్పుడు కిర్రుమని చప్పు డయింది.

ఆ చప్పుడుకు ఇంటి వాళ్ళు ఒకరిద్దరు మేలుకుని, ఆశ్చర్యపోతూ, "ఏమిటది?" అన్నారు.

అందులో ఒకడు నిద్రమత్తుతో లేచి వచ్చి, భోషాణం మీద పడుకుంటూ, 'నిద్రపొండి. తెల్లవారి లేచి చూసు కుందాం,'' అన్నాడు.

దొంగకొడుకు భోషాణంలో చిక్కుకు పోయాడు. ఈ సంగతి తెలియగానే,



బయట ఉన్న దొంగ ఇంటిదారి పట్టాడు. అది చూసి ఆశ్చర్యపడుతూ, దొంగల వెంట వెళ్ళిన అబ్బాయి దొంగ వెనకనే వచ్చేశాడు. దొంగ ఇంటికి వచ్చి, తలుపులు వేసుకుని, నిశ్చింతగా నిద్రపోయాడు. తన కొడుకు ఏమవుతాడా అన్న బెంగ వాడికి కొంచెం కూడా లేనట్టు కనిపించింది.

ఈ లోపున, భోషాణంలో చిక్కుకుపోయిన దొంగ కొడుకు తాను పట్టుకుపోగలిగినన్ని నగలు కట్టుకుని, ఎలుకలాగా చప్పుడు చేశాడు. అది విని, భోషాణం మీద పడుకున్నవాడు, ''ఎలుక! ఎలుక!'' అంటూ కిందికి దిగి భోషాణం తలుపు ఎత్తాడు. వెంటనే దొంగ కొడుకు చెంగున బయటికి దూకి, భోషాణం మీది నుంచి దిగినవాణ్ణి గట్టిగా ఒక తన్ను తన్ని, తండ్రి చేసిన కన్నం కుండా బయటపడి, కాలిసత్తువ కొద్దీ పరిగెత్తాడు.

కాని ఈలోగా ఇంటిల్లిపాతీ లేచి, ''దొంగ! దొంగ!'' అంటూ వాడి వెంట పడ్డారు. అప్పుడు దొంగ కొడుకు ఒక పెద్దరాయి ఎత్తి దారిలో ఉన్న బావిలో పడేసి, దగ్గిరలో ఉన్న చెట్టు ఎక్కి కూర్చున్నాడు. ఆ చప్పుడు విని కుర్రవాణ్ణి వెంబడించే వారంతా బావి దగ్గిరికి చేరారు. కొందరు దీపాలు తెచ్చారు. కొందరు సాహసులు బావిలోకి దిగారు. కాని దొంగ జాడలేదు. ఇదంతా జరిగేసరికి చాలా సేపు పట్టింది. దొంగ ఎప్పుడో తప్పించుకు పోయి ఉంటాడనుకుని అందరూ ఇంటికి తిరిగి వెళ్ళిపోయారు.

తరవాత దొంగ కొడుకు తాపీగా చెట్టు దిగి, ఇంటికి తిరిగి వచ్చి, తండ్రిని లేపి, జరిగినదంతా చెప్పాడు. అదంతా అరుగు మీద పడుకున్న సాధువూ, అబ్బాయీ విన్నారు.

సాధువు ఆ అబ్బాయితో, ''చూశావా, నాయనా? ఆఖరుకు చోరవిద్య కూడా అనుభవంతోనే నేర్చుకోవాలి. చెప్పిచ్చిన విద్య ఎందుకూ పనికిరాదు. నా మాట అర్థమైందిగదా,'' అన్నాడు.



# 169. తొలి వైమానికుల గౌరవచిహ్నం

**1903** డిసెంబరు 17 న, ఉత్తర కారొలైనారాష్ట్రం లోని ఈ ప్రాంతం నుంచి విల్బర్ రైట్, ఆర్విల్ రైట్ సోదరులు మొట్టమొదట విమానంలో ఎగిరారు. వారి గౌరవార్థం ఈ శిల్పం ఏర్పాటు చేయబడింది.






రాజా నీహారకుమారుడు గుర్రం మీది నుంచి పడి కాలు విరగగొట్టుకున్నాడు. మహామంత్రి ధీమాన్ చూడ వచ్చినప్పుడు ఆయన అమిత నిరాశగా తనపని అయి పోయినట్టు మాట్లాడాడు.

"ఎందుకలా నిరుత్సాహపడి పోతారు, మహారాజా? ఎముక విరిగింది. మన ఆస్థానవైద్యుడు దండకుడు తేలికగా చికిత్స చేస్తాడు. రెండు వారాలకల్లా లేచి, తిరుగుతారు." అన్నాడు ధీమాన్.

"మీకు తెలీదు, మహామంత్రీ! నా కాలు నరికివెయ్యవలసిందే. రెండు నెలల క్రితం మన ఆస్థానజ్యోతిష్కుడు చెప్పనే చెప్పాడు. నేను గుర్రం మీది నుంచి పడతానని ఆయన చెప్పిన మాట నిజం అయినప్పుడు కాలు తీసేస్తారన్న మాట ఎందుకు నిజంకాదూ?" అన్నాడు రాజు.

రాజు నిస్పృహకు కారణం తన కాలు పోతుందన్నది మాత్రమే కాదు. వారి వంశంలో వికలాంగులు రాజ్యం చెయ్య రాదన్న నియమం ఉన్నది. నీహార కుమారుడు వికలాంగుడైతే, ఆయనకు సంతానం లేదు గనక, ఆయన తమ్ముడు సురసేనుడు రాజ్యానికి రావాలి. అయితే సురసేనుడు మహాక్రూరుడూ, దుర్జ నుడూనూ.

మహామంత్రి ధీమాన్ ఆలోచనలోపడి జరిగినది జ్ఞాపకం తెచ్చుకున్నాడు.

ఒకనాడు రాజు తన విలాసభవనంలో కూర్చుని ఉండగా ఆస్థాన జ్యోతిష్కుడు వచ్చి నమస్కారం చేసి, "మహారాజా, ఈ ఉదయం తమ జాతకం పరీక్షించాను. తమకు ఒక దుర్వార్త చెప్పవలసి ఉన్నది. నేటి నుంచి రెండు నెలలలో తమకు ఒక ప్రమాదం కలిగి, దాని

ఏ. సి. సర్కార్, ఇంద్రజాలికుడు

ఫలితంగా తమ అవయవాలలో ఒకటి తీసి వేయటం జరుగుతుంది.'' అన్నాడు.

జోస్యంలో అమిత విశ్వాసంగల రాజు ఈ మాట విని దిగ్భ్రమ చెందాడు.

ఇలా ఉండగా ఒకనాడు రాజభటులు రాజుతో, తూర్పు పొలిమేర వద్ద ఒక అందమైన తెల్లగుర్రం స్వేచ్ఛగా తిరుగుతున్నట్టు చెప్పారు. రాజుకు గుర్రాలంటే ఎంతో ప్రీతి. రాజు దాన్ని చూసి చాలా ముచ్చటపడ్డాడు. ఆయన దాని మీద ఎక్కి సవారీ చేసి చూశాడు. అది సాధువు. దాని నడకా, పరుగూ కూడా తొట్రుబాటులేకుండా తిన్నగా ఉన్నాయి. రాజు ప్రతిరోజూ దాని మీద ఎక్కి తిరగసాగాడు.

ఒకనాటి ఉదయం రాజు దాని మీద ఎక్కి అతివేగంగా రాజమార్గాన తన భవనాని కేసి వస్తూండగా, ప్రజలు అటూ ఇటూ తప్పుకుని గుర్రానికి దారి ఇచ్చే సమయంలో, గుర్రం అంత వేగంలోనూ చప్పున ఆగిపోయి, వెనక కాళ్ళమీద లేచింది. అప్పుడు రాజు కిందపడిపోయాడు. ఆయన ఎడమకాలి ఎముక విరిగింది.

ధీమాన్ ఈ సంఘటన గురించి ఆలోచిస్తూ, అంత సాధువైన గుర్రం అలా ఎందుకు ప్రవర్తించినదీ అర్థం చేసుకో




లేక, ఆ గుర్రం మీద అనేకమంది చేత సవారీ చేయించి, చివరకు ఒక సంగతి తెలుసుకున్నాడు: ఆ గుర్రం పసుపు పచ్చరంగు చూసి బెదురుతుంది! ఆయన ఇంకా ఆరాలు తీయగా, రాజుకు ప్రమాదం జరిగిన సమయంలో సురసేనుడి మనుషులు పచ్చజెండాలు పట్టుకుని ప్రమాదం జరిగిన చోట నిలబడి ఉండినట్టు తెలియవచ్చింది.

ఇంకా లోతుగా ఆచూకీతీసి మహామంత్రి పెద్ద కుట్రను గురించి తెలుసుకున్నాడు. సురసేనుడి అశ్వనిపుణులు ఆ గుర్రానికి ప్రత్యేకమైన శిక్షణ ఇచ్చి, అది పచ్చరంగు చూసి బెదిరేటట్టుగా




తయారుచేశారు. తరవాత ఆ గుర్రాన్ని సరిహద్దు ప్రాంతంలో వదిలి, దాన్ని గురించిన వార్త రాజుకు అందించినది కూడా సురసేనుడి మనుషులే.

సురసేనుడు రాజద్రోహం తలపెట్టినది రాజ్య కాంక్షతోనేనని మహామంత్రి గ్రహించి, ఆ కుట్రను నిర్మూలించ నిశ్చయించాడు. అనేకమంది సంస్థాన ప్రముఖులు ఈ కుట్రలో చేరి ఉన్నట్టూ, వారంతా సురసేనుడి పక్షం అయినట్టూ మహామంత్రికి తెలిసింది. అనుమానితులలో ఆస్థాన జ్యోతిష్కుడూ, ఆస్థాన వైద్యుడూ ఉన్నారు. అయితే ఈ కుట్ర దారులను గురించి తగిన సాక్ష్యాధారాలులేవు. అందుచేత మహామంత్రి ఈ విషయం రాజుకు తెలుపదలచలేదు.

కాని కుట్రను గురించి రాజుకు తెలియనియ్యకుండా ఆయన నిస్పృహను ఎలా తొలగించాలా అన్నది మహామంత్రికి సమస్య అయికూర్చున్నది. ఆయనకు మాయాధరుడు అనే ఐంద్రజాలికుడు మిత్రుడు. మహామంత్రి మాయాధరుడితో సంప్రతించి ఒక చక్కని పథకం వేశాడు.

మహారాణి రూపమతి జన్మదేశంలో ఒక వైద్యుడున్నాడు. అతను విరిగిన ఎముకలను అతకటంలో గొప్పనిపుణుడు. అతని పేరు జీవకుడు. మహామంత్రి మహారాణిరూపమతి ద్వారా జీవకుణ్ణి రప్పించి, అతన్ని వెంటబెట్టుకొని రాజు వద్దకు వెళ్లి, "మహారాజా, ఈ జీవకుడు సాధారణ వైద్యుడుకాడు. ఇతను విరిగిన ఎముకలను అతకటంలో ఘటికుడు. ఇతను అతీత శక్తులు గలవాడు: అతను, ఎముకలనే ఏమిటి, విరిగిన పుల్లలను కూడా అతకగలవాడు. కావాలంటే చూడండి." అంటూ ఒక చేతిరుమాలును బల్లమీద పరిచాడు. తరువాత ఆయన అగ్గిపుల్ల ప్రమాణంలో ఉన్న రెండు అంగుళాల పుల్లనుతీసి, దానిమీద రాజు చేతనే సిరాతో గుర్తు వేయించి, చేతికి రుమాలును చుట్టి, ఆ పుల్లను విరవమన్నాడు.

"మహారాజా! ఈ పుల్లే మీ కాలిఎముక అనుకోండి. దానిమీద చుట్టిన రుమాలు మీ కాలికండరాలు అనుకోండి. గుడ్డమీద నొక్కిచూస్తే, మీకు పుల్ల తెలుస్తుందిగద? దాన్ని మీ ఇష్టం వచ్చినన్ని తుంపులు చేయండి," అన్నాడు మహామంత్రి.

రాజు గుడ్డమీదుగా పుల్లను పట్టుకుని, దాన్నిరెండుచోట్ల విరిచి, మూడు తుంపులు చేశాడు. మహామంత్రి చేతిరుమాలును తీసుకుని జీవకుడికి ఇచ్చాడు. జీవకుడు ఏవో మంత్రాలు చదివి, దానిమీద మూడు సార్లు ఊది, విప్పాడు. రాజు గుర్తించిన పుల్ల వున్నది ఉన్నట్టుగా కిందపడింది.

రాజు ఆశ్చర్యంతో కళ్ళుపెద్దవి చేసి పుల్లకేసిచూసి, జీవకుడి చేత చికిత్సపొంద టానికి ఒప్పుకున్నాడు. జీవకుడు అప్పటి కప్పుడే చికిత్స ప్రారంభించి, రాజు కాలుకు కట్టు కట్టాడు. తరవాత మంత్రి, రాజుకు పరిపూర్ణమైన విశ్రాంతి కావాలని వంకపెట్టి, ఆయనను క్షేమకరమైన చోటికి చేర్చాడు.

ఒకవారం గడిచేసరికి రాజు పరిస్థితిలో చాలా మంచి మార్పు కనిపించింది. ఈ లోపల మహామంత్రి ధీమాన్ కుట్రదారులను గురించి మరికొన్ని వివరాలు సంపాదించాడు. ఆయన రాజుతో రాజద్రోహుల ఎత్తుగడలను గురించి చెప్పేశాడు.



రాజు ఉద్రేకంతో రాజద్రోహులందరినీ పట్టమన్నాడు.

"నిదానించండి, మహారాజా. సరి అయిన తరుణంలో చేపలన్నీ మన వలలో పడతాయి," అన్నాడు మహామంత్రి.

"సరే, నీ యిష్టప్రకారమే చెయ్యి," అన్నాడు రాజు.

"కాని, తమరు కొంత శ్రమపడి, మీ కాలు పోయినట్టు కొంతసేపు నటించవలసి ఉంటుంది. మీకాలు తీసేసినట్లు నేను ప్రకటించ బోతున్నాను. జీవకుడు మీ కాలు లేనట్టుగా కట్టుకడతాడు. మీరు కొద్దిసేపు చంక కర్రల సహాయంతో నడవాలి," అన్నాడు ధీమాన్.

అంతా సక్రమంగానే జరిగింది. రెండో వారం పూర్తి అయేసరికి రాజు కాలు దాదాపు మామూలుగా అయిపోయింది.

"నువ్వు చేసినది అద్భుతమైన పని," అని మంత్రి జీవకుణ్ణి ప్రశంసించాడు.

"మీరు చేసిన దానికన్న అద్భుతమా? మీరు విరిగిన పుల్లను క్షణంలో అతికించారు గద!" అన్నాడు జీవకుడు.

"అందులో నేను చేసినది ఏమీలేదు. అదంతా మాయాధరుడి ఇంద్రజాలం. నేను ఉపయోగించిన చేతిరుమాలు అంచులో అలాటి పుల్ల ఒకటి అదివరకే ఉన్నది. గుర్తుపెట్టిన పుల్లను అందులో పెట్టి చుట్టి, రాజుగారి చేతికి, అందులో ఉన్న పుల్లలను అందించాను. అసలు పుల్ల మడతలలో మరొకచోట ఉన్నది. రాజుగారు నకలు పుల్లను తుంపారు. తునిగిన పుల్ల రుమాలు అంచులోనే ఉండిపోయింది," అన్నాడు మహామంత్రి.

ద్రోహులను పట్టటం కూడా జయప్రదంగానే ముగిసింది.

రాజు కాలు తీసేశారని వినగానే సురసేనుడు మహాసంతోషించాడు. అతని అనుచరులు పొంగిపోయారు. సురసేనుడి పట్టాభిషేకం నిర్ణయం అయిన రోజున రాజు చంకకర్రలతో సభకు వచ్చాడు. సురసేనుడు తనఅనుచరులతో కిరీటం పెట్టించుకునేటందుకు వచ్చాడు. నీహారకుమారుడు కిరీటం పట్టుకుని సురసేనుడి నెత్తిన పెట్టబోతూండగా, "ఆగండి!" అన్న కేక సభలో ప్రతిధ్వనించింది. ఆ కేకపెట్టినవాడు మహామంత్రి. ఆయన వెంట వచ్చిన రాణి ఒక కత్తి తీసుకుని రాజు కాలును ఎత్తి కట్టిన పట్టీలను నరికేసింది. రాజు కాలు కిందికి దించి నిటారుగా నిలబడి, "రాజద్రోహులను బంధించండి!" అన్నాడు.

త్వరలోనే ద్రోహుల విచారణజరిగింది. వారందరికీ దేశబహిష్కరణ శిక్ష విధించారు. తరువాత రాజా నీహారకుమారుడు రాణీరూపమతితో ప్రశాంతంగా ప్రజాపాలన కొనసాగించాడు.






ప్రహస్తుడు హనుమంతుణ్ణి రావణుడు కోరినట్టు అడిగితే, హనుమంతుడు ఇలా సమాధానం చెప్పాడు:

"రాక్షసరాజువైన నిన్ను చూడగోరి అశోకవనం విరిచాను. అది నాకు సులభంకాలేదు. అప్పుడు బలవంతులైన రాక్షసులు నా మీద యుద్ధానికి వచ్చారు. నేను ఆత్మరక్షణ కోసం వారితో యుద్ధం చెయ్యవలసి వచ్చింది. నన్ను ఏ అస్త్రం గాని, పాశం కాని బంధించలేవని బ్రహ్మదేవుడి వరం ఉన్నది. నిన్ను చూడటం కోసమే బ్రహ్మాస్త్రానికి కట్టుబడ్డాను. అంతకన్న మరేమీలేదు. నేను మహాపరాక్రమశాలి అయిన రాముడి దూతను. నీతో నా కొక రాజకార్యం ఉన్నది. నీ మేలు కోరి చెప్పే నా మాటలు శ్రద్ధగా ఆలకించు.

"సుగ్రీవుడు నీకు తన క్షేమం తెలిపి, నీ క్షేమం అడగమన్నాడు. వాలి నీకు తెలును. ఆ వాలిని రాముడు ఒక్క బాణంతో చంపి, సుగ్రీవుణ్ణి వానర రాజును చేశాడు. సుగ్రీవుడు సీతను వెతికిస్తానని మాట ఇచ్చి, ఆ ప్రకారం అన్ని దిక్కులకూ వానరులను పంపాడు. వారిలో నేను ఒకణ్ణి. నేను వాయుదేవుడి కొడుకును. నా పేరు హనుమంతుడు. నేను నూరు యోజనాల సముద్రాన్ని దాటి సీతను చూడటానికి ఇక్కడికి వచ్చాను. నీ అధీనంలో ఉన్న సీతను చూశాను. ధర్మం తెలిసిన నీ వంటివాడు

**16. లంకాదహనం**



నేను మనిషినీ కాను, రాక్షసుణ్ణీ కాను, అందుచేత పక్షపాతం లేకుండా ఉన్న మాట చెబుతున్నాను. నిన్ను రాముడి బారినుంచి ఎవరూ రక్షించలేరు."

హనుమంతుడు ఇలా నిర్భయంగా చెప్పిన మాటలు విని రావణుడు కోపోద్రేకంతో, "ఈ హనుమంతుణ్ణి చంపండి!" అని కేక పెట్టాడు.

అప్పుడు బుద్ధిమంతుడైన విభీషణుడు రావణుడితో, "రావణేశ్వరా! హనుమంతుణ్ణి చంపటం రాజధర్మానికి విరుద్ధం; లోకాచారానికి వ్యతిరేకం. కోపం విడిచిపెట్టి దూతకు తగి ఉండే శిక్ష ఏదైనా విధించు," అన్నాడు.

రావణుడి కోపం ఏ మాత్రమూ తగ్గలేదు. అతను విభీషణుడితో, "ఈ వానరుడు పాపి. పాపులను చంపటంలో పాపం ఏమీ లేదు," అన్నాడు.

దానికి విభీషణుడు, "ఎలాంటి పరిస్థితిలోనూ దూతను చంపరాదని పెద్దలు చెబుతారు. అయినా దూతకు తగిన శిక్షలు అనేకం చెప్పబడి ఉన్నాయి. అంగవైకల్యం కలిగించవచ్చు; కొరడాతో కొట్టవచ్చు; తల గొరగవచ్చు; కాల్చి ముద్ర వేయవచ్చు. కాని దూతను చంపటమన్నది ఏ శాస్త్రంలోనూ కనబడదు. నీ వంటి ధైర్యశాలి కోపానికి వశుడు కారాదు.

బలాత్కారంగా పరస్త్రీని పట్టి ఉంచరాదు. రామలక్ష్మణుల కోపానికి గురి అయి సుఖపడగలవాడు మూడు లోకాలలోనూ ఉండడు. ఈ మాట సుగ్రీవుడు నీతో చెప్పమన్నాడు. నేను సీతను చూశాను కనక ఇక కర్తవ్యం రాముడి మీద ఉన్నది. అది ఏమిటో నాకైతే తెలియదు. తలచుకుంటే నేనే నీ లంకను ధ్వంసం చెయ్యగలను, కాని రాముడు అందుకు ఒప్పుకోడు. సీతను అపహరించిన వాళ్లను తానే చంపుతానని వానర, భల్లూక సేనల ముందు అతను ప్రతిజ్ఞ చేసి ఉన్నాడు. సీత నీ పాలిటి మృత్యుదేవత అన్నది గ్రహించి, నీ క్షేమం ఆలోచించుకో.

అది అలా ఉంచి, ఇతన్ని చంపటం వల్ల మనకు లాభం ఏమీ ఉండదు. నువు చంపవలసినది ఇతన్ని ఇక్కడికి పంపిన వాళ్ళను. ఇతను చెప్పిన మాటలు ఇతనివి కావు. సముద్రాన్ని దాటగల వాడు ఇతను తప్ప మరొకడు ఉన్నాడని నాకు తోచదు. అందుచేత, ఇతన్ని చంపితే, రామలక్ష్మణులను ఇక్కడికి రప్పించి, నీతో యుద్ధం చేయటానికి తోడ్పడేవాడు మరొకడు ఉండడు. వాళ్లను పట్టుకున్నట్టయితే నీ కీర్తి హెచ్చుతుంది," అన్నాడు.

రావణుడు విభీషణుడు చెప్పిన దానికి తృప్తిపడి అతను చెప్పినట్టు చేయ నిశ్చయించాడు. అతను ఇలా అన్నాడు:

"నువు చెప్పినది నిజం. దూతను చంపటం తప్పే. అందుచేత ఇతనికి మరొక శిక్ష ఇద్దాం! కోతులకు ప్రియమైనది తోక. ఇతన్ని తోక కాల్చి వదిలెయ్యండి."

హనుమంతుడి తోకకు నిప్పు అంటించి, అతన్ని నగరమంతటా తిప్పి, కూడలి స్థలాలలో ప్రదర్శించమని ఉత్తరువు అయింది.

రాక్షసులు గుడ్డ పేలికలు తెచ్చి హనుమంతుడి తోకకు చుట్టారు; తరవాత తోక మీద నూనె పోసి నిప్పు అంటించారు.

వాళ్ళు ఈ తతంగం చేస్తున్నంతసేపూ హనుమంతుడి కోపం కార్చిచ్చులాగా పెరిగిపోతూ వచ్చింది. చివరకు అతను





మండుతున్న తన తోకతో వాళ్ళను చావ బాదాడు.

ఈ లోపుగా హనుమంతుడి తోకను తగలబెట్టుతున్నారన్న వార్త విని లంకలో ఉన్న పిల్లలూ, స్త్రీలూ, ముసలివాళ్ళూ పరమానందంతో చూడటానికి వచ్చారు. అందరు రాక్షసులూ చేరి హనుమంతుణ్ణి మళ్ళీ పట్టుకుని కట్టేసి, తీసుకుపోయారు. తన తోక కాలుతుందన్న భయం లేనందువల్ల హనుమంతుడు వాళ్ళవెంట వెళ్ళాడు. అప్పుడు తను చిన్నరూపంలోనే ఉన్నాడు.

రాక్షసులు శంఖాలు ఊదుతూ, భేరీలు మోగిస్తూ, హనుమంతుణ్ణి లంక అంతా తిప్పారు. ఇలా తిరుగుతూ హనుమంతుడు లంకలో ఆయుధాలు ఉండే ప్రదేశాలూ, ఇతర రహస్య స్థావరాలూ చక్కగా చూశాడు. వెళ్ళిన చోటనల్లా రాక్షసులు హనుమంతుణ్ణి, "వేగులవాడు" అని చాటారు.

రాక్షసస్త్రీల ద్వారా సీత, హనుమంతుడి తోకకు నిప్పుపెట్టిన వార్త విని, ఎంతో దుఃఖించి, అగ్నిహోత్రుణ్ణి తలుచుకుని, హనుమంతుడికి అపాయం కలగకుండా చూడమని ప్రార్థించింది.

సీత పడేబాధ చూసి సరమ, "అమ్మా, ఆ కోతిని గురించి నువు దిగులుపడకు. అతను మహానుభావుడు. అతను తన వెంట ఉన్న రాక్షసులనందరినీ చావగొట్టి, ఒక ఇంటి మీదినుండి మరొక ఇంటి మీదికి దూకుతూ లంకనంతా తగలబెట్టుతున్నాడు. అదుగో చూడు!" అన్నది.

సరమ చెప్పినది అక్షరాలానిజం. హనుమంతుడు రాక్షసులను శిక్షించ నిశ్చయించుకుని, తన దేహాన్ని అతి చిన్నది చేసి, కట్ల నుండి బయటపడ్డాడు. అతను తిరిగి దేహాన్ని పెంచి, నగర ద్వారం వద్ద ఉన్న ఇనుప పరిఘ తీసుకుని తన వెంట ఉన్న రాక్షసులందరినీ చంపాడు. అప్పుడతనికి లంకను తగలబెట్టాలన్న ఆలోచన వచ్చింది. అతను కాలుతున్న తోకతో ఇళ్ళ మీదుగా తిరగనారంభించాడు.

అతను ముందు ప్రహస్తుడి ఇల్లుకాల్చి, మహాపార్శ్వుడి ఇంటికి వెళ్ళాడు. అందులో చిచ్చుపెట్టి, వరసగా, శుకుడూ, వజ్రదంష్ట్రుడూ, సారణుడూ, ఇంద్రజిత్తూ, జంబుమాలీ, సుమాలీ మొదలైన రాక్షస ప్రముఖుల ఇళ్లన్నీ తగలబెట్టాడు. అతను ఒక్క విభీషణుడి ఇంటిని వదిలిపెట్టాడు. రాక్షసుల ఇళ్ళే కాక, వాళ్లు ఎంతో కాలంగా చేర్చిపెట్టుకున్న సంపదలన్నీ బూడిద అయిపోయాయి. చివరకు అతను రావణుడి ఇల్లు కూడా కాల్చాడు.

అంతవరకూ రావణుడికి భయపడుతూ వచ్చిన అగ్నీ, వాయువూ ఇప్పుడు విజృంభించినట్టు కనపడ్డారు. ఇళ్ళలోని వెండి బంగారాలు కరిగిపోయాయి. మహా భవనాలు మట్టిలో కూలిపోయాయి. ఈ దహనకాండను ఎలా ఆపాలో రాక్షసులకు తెలియలేదు. అగ్నిహోత్రుడే కోతి రూపంలో వచ్చి ఉంటాడని వాళ్ళకు అనుమానం కలిగింది. చాలామంది రాక్షసులు మంటలకు ఆహుతి అయారు. ఎంతో అందమైన లంకానగరం బీభత్స రూపం ధరించింది. రాక్షసుల ఆర్త నాదాలు మిన్నుముట్టాయి.

హనుమంతుడి ఆగ్రహం తీరింది. అతను తృప్తిపడ్డాడు. అతను వచ్చిన పని జయప్రదమయింది. అశోకవనం



ధ్వంసమయింది. అనేకమంది రాక్షసులు చచ్చారు. లంక బూడిద అయింది. అతను వెళ్ళి, తన తోకను సముద్రంలో ముంచి చల్లార్చాడు.

అప్పుడు అతనికి తాను చాలా చెడ్డపని చేశానని పశ్చాత్తాపం కలిగింది. లంక అంతా తగలబడినాక సీత క్షేమంగా ఉంటుందా అని అతనికి భయంకలిగింది. ఆవేశం కొద్దీ లంకను తగల బెట్టుతూ తాను సీతను రక్షించాలన్న మాట మరిచాడు. నిజంగా సీతకు ఆపద జరిగి ఉంటే అతను అక్కడే చచ్చిపోవటానికి నిశ్చయించుకున్నాడు. అయితే అతనికి ఇంకో ఆలోచన వచ్చింది. తన తోకనే



కాల్చని అగ్నిహోత్రుడు సీతాదేవిని ఎందుకు కాల్చుతాడు? అతను శింశుపా వృక్షం వద్దకుపోయి, దానికింద ఉన్న సీతను చూసి, నమస్కరించి, "అమ్మా, నా అదృష్టం బాగుండి నువు క్షేమంగా ఉన్నావు గద!" అన్నాడు.

సీత అతనితో, "హనుమంతుడా, నీ బలం ఎలాటిదని చెప్పాలి! నువు ఒక్కడివే ఈ రాక్షసులందరినీ చంపి, నన్ను రాముడి దగ్గిరికి తీసుకుపోగలవు. కాని రాముడే వచ్చి, శత్రువులను చంపి నన్ను తీసుకుపోవటం ఉచితంగా ఉంటుంది. అందుచేత, నువే రాముణ్ణి అలా చేయమని ప్రేరేపించు," అన్నది.

"నీకు సందేహం అవసరం లేదు. రాముడు తప్పక వచ్చి నీ దుఃఖం తీర్చుతాడు," అని సీతకు చెప్పి, ఆమె వద్ద సెలవుపుచ్చుకుని, అరిష్టం అనే పర్వతం ఎక్కి, తిరిగి సముద్రాన్ని దాటటానికి సిద్ధపడి, తన దేహాన్ని పెంచాడు. అతను కాళ్ళతో పర్వతాన్ని తన్ని గాలిలోకి లేచేసరికి, అరిష్టపర్వతం అదిరింది.

అతను మబ్బుల మధ్యగా ఎగురుతూ సముద్రాన్ని దాటి, దూరాన మహేంద్ర పర్వతాన్ని చూస్తూనే గట్టిగా సింహనాదం చేశాడు. హనుమంతుడి కోసం ఆత్రంగా ఎదురుచూస్తున్న అంగదుడు మొదలైన వానరులు ఆ సింహనాదం విన్నారు. వారికి ఎక్కడలేని ఉత్సాహమూ పుట్టుకొచ్చింది.

అప్పుడు జాంబవంతుడు మిగిలిన వానరులతో, "హనుమంతుడు వెళ్ళిన పని జయప్రదం అయింది. లేకపోతే అతను ఇంత గట్టిగా సింహనాదం చెయ్యడు," అన్నాడు. ఈ మాటకు వానరులు పరమానందం చెంది, హనుమంతుణ్ణి చూడటానికి చెట్లూ, గట్లూ ఎక్కారు; అతను దూరంగా కనపడగానే చెట్లకొమ్మలు ఆడించారు.

త్వరలోనే హనుమంతుడు మహేంద్ర పర్వతం మీద దిగాడు. వానరులందరూ

అతని చుట్టూ మూగారు. వాళ్ళు అతనికి కందమూలఫలాలు తెచ్చి ఇచ్చారు. హనుమంతుడు జాంబవంతుడికీ, అంగదుడికీ, ఇతర పెద్దలకూ నమస్కారాలు చేశాడు. అతను నోరు తెరుస్తూనే, ''చూశాను సీతను!'' అని రెండు ముక్కల్లో ముఖ్య విషయం చెప్పాడు. ఆ మాటకు వానరులు అమితంగా సంతోషించారు. కొందరు సింహనాదాలు చేశారు. కొందరు గట్టిగా అరిచారు. కొందరు గర్జించారు. కొందరు మామూలు కోతుల్లాగా కిచకిచలాడారు. కొందరు తమ తోకలను బలంగా నేలకేసి కొట్టారు.

హనుమంతుడు వానరులతో, ''సీతను చూశాను.'' అనేసి ఇంకేమీ చెప్పకుండా ఉండిపోయాడు.

అప్పుడు అంగదుడు హనుమంతుడితో, ''హనుమంతుడా, నూరు యోజనాల సముద్రాన్ని ఇటు నుంచి అటూ, అటు నుంచి ఇటూ దాటిన నీ బలపరాక్రమాలు మరొకరికి సాధ్యం కావు. నీకు గల రాజభక్తి కూడా అసాధారణ మైనది. మా అందరి అదృష్టం కొద్దీ నువు రాముడి భార్య అయిన సీతాదేవిని చూశావు. ఇంక రాముడికి సీతా విరహం ఉండదు,'' అన్నాడు.

మధ్య హనుమంతుడూ, అంగదుడూ, జాంబవంతుడూ మహేంద్ర పర్వతం మీద కూర్చుంటే మిగిలిన వానరులందరూ చుట్టూ ఉన్న శిలల మీద కూర్చున్నారు. లంకలో జరిగినదంతా హనుమంతుడి నోట వినాలని వారికి కుతూహలంగా ఉన్నది.

జాంబవంతుడు హనుమంతుడితో, ''నాయనా, నువు సీతాదేవిని ఎలా చూశావు? ఆవిడ ఎలా ఉన్నది? రావణుడు ఆమెను ఎలా చూస్తున్నాడు? అంతా విన్న తరవాత మనం కర్తవ్యం ఆలోచించుదాం. ఉన్నదంతా నువు దాచకుండా చెబితే, రాముడితో మనం ఏ సంగతి చెప్పవచ్చునో, ఏది దాచాలో చూసుకోవచ్చు.'' అన్నాడు.






ఏకో దేవః, కేశవో వా శివోవా,
ఏకం మిత్రం, భూపతిర్వా యతిర్వా,
ఏకా భార్యా, సుందరీ వా దరీవా,
ఏకో వాసః, పత్తనే వా వనేవా. 1

[దేవుడు కేశవుడైనా కావాలి శివుడైనా కావాలి; స్నేహితుడు రాజు కావాలి, లేదా యతి కావాలి; కాపరం చేస్తే అందమైన స్త్రీతో చెయ్యాలి, లేదా కొండగుహలో చెయ్యాలి; ఉంటే పట్టణంలో ఉండాలి, లేదా అడవిలో ఉండాలి.]

కుసుమ స్తబకస్యేవ ద్వయీ వృత్తి ర్మనస్వినః,
మూర్ధ్ని వా సర్వలోకస్య, శీర్యతే వన ఏవ వా. 2

[పూలగుత్తి లాగా అభిమానవంతుడికి రెండే మార్గాలు—అందరి నెత్తినా అలరారటమో, అడవిలో అణగారి పోవటమో.]

నిందంతు నీతినిపుణా యది వా స్తువంతు,
లక్ష్మీ స్సమావిశతు, గచ్ఛతు వా యథేష్టమ్,
అద్యైవ వా మరణ మస్తు, యుగాంతరే వా,
న్యాయాత్పథః ప్రవిచలంతి పదం న ధీరాః. 3

[నీతివేత్తలు నిందించనీ; ఐశ్వర్యం రానీ, పోనీ; మరుక్షణమే మరణం రానీ, యుగాంతం దాకా రాకపోనీ; ధైర్యవంతులు నీతి మార్గం తప్పరు.]

## ఏకదృష్టి

Photo by A. L. Syed



బహుమతి
పొందిన వ్యాఖ్య

గర్వం హద్దెరగదు

పంపినవారు :
**ఆర్. ఐ. రావు**

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 20 లు







* వ్యాఖ్యలు జనవరి 20వ తేదీలోగా చేరాలి. వ్యాఖ్యలు పోస్టుకార్డు పైనమాత్రమే రాయాలి.
* వ్యాఖ్యలు ఒక్కమాటలో గాని, చిన్న వాక్యంలో గాని వుండాలి. రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి. గెలుపొందిన వ్యాఖ్యలు మార్చి నెల సంచికలో ప్రకటించబడును.

# చందమామ

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు




Printed by B. V. REDDI at Prasad Process Ltd., and Published by B. VISWANATHA REDDI for Chandamama Publications, 2 & 3. Arcot Road. Madras-600026. Controlling Editor : NAGI REDDI

## రు 100 లు గెలవండి!

## చందమామ పాఠకులకు కొత్త సమస్య

# అబద్ధం

ఒక రాజుకు తాను చాలా తెలివిగల వాడిననీ, ఎవరూ అబద్ధం చెప్పి తనను నమ్మించలేరనీ చాలా గర్వం ఉండేది. ఒక రోజు రాజుకు, నిండు సభలో తన తెలివి ప్రదర్శించాలని బుద్ధిపుట్టింది.

ఆయన సభలోని సభికులను ఉద్దేశించి, "అబద్ధం చెప్పి నన్ను నమ్మించిన వాళ్ళకు వెయ్యి వరహాలు బహుమానం ఇస్తాను," అన్నాడు.

ఎవరూ మాట్లాడలేదు. కాని ఒకడు లేచి, "రాజా, నేను అబద్ధం చెప్పి మిమ్మల్ని నమ్మించగలను," అన్నాడు.

రాజు వెంటనే, "సరే, చెప్పు!" అన్నాడు.

"ఇంకా చెప్పేదేమిటి? గెలిచాను! వెయ్యి వరహాలూ ఇప్పించండి," అన్నాడు సభికుడు.

రాజు గతుక్కుమని, కొంచెం ఆలోచించి, వాడికి వెయ్యి వరహాలూ ఇచ్చేశాడు.

ప్రశ్న: సభికుడు నిజంగా అబద్ధమాడి రాజును నమ్మించాడా? ఏమిటా అబద్ధం?

ఈ ప్రశ్నకు ఉత్తమ సమాధానం పంపిన వారికి రు 100. బహుమానం. జవాబులు సంగ్రహంగానూ, సమగ్రంగానూ ఉండాలి. మీ సమాధానం వెంట దీనితో జతపరిచిన ప్రశ్నావళి పూర్తిచేసి పంపాలి. అలా పంపిన సమాధానాలు మాత్రమే పరిశీలించబడతాయి. మీ సమాధానాలు జనవరి 20 లోపున క్రింది చిరునామాకు చేరాలి.

'చందమామ' పాఠకుల పోటీ

చందమామ పబ్లికేషన్స్, మద్రాసు 600 026

# కూపన్

1. మీ పేరు: చిరునామా: ______________________

______________________

2. మీ వయసు: ______________________

3. మీరు ఎంతమంది అన్నదమ్ములు, అక్కచెల్లెళ్ళు?: ______________________

4. మీ ఇంట్లో చందమామను ఎంతమంది చదువుతారు?: ______________________

5. వాళ్ళ వయస్సులు: ______________________

6. చందమామను ఇతరులకు అరువిస్తారా? ______________________

7. ఎంతమంది మీ వద్ద చందమామ అరువు తీసుకుని చదువుతారు?: ______________________

8. మీ తండ్రిగారు ఏం పని/ఉద్యోగం చేస్తారు?: ______________________

9. మీది సొంత ఇల్లా? అద్దె ఇల్లా?: ______________________

10. మీ కుటుంబానికి కారు/మోటారుసైకిలు వగైరా వాహనాలున్నాయా?: ______________________

11. చందమామతో బాటు మీరు ఇంకా ఏఏ పత్రికలు కొని చదువుతారు?: ______________________

సంతకము








సురేష్ ప్రొడక్షన్స్

# సోగ్గాడు

ఈస్ట్‌మన్ కలర్

నిర్మాత: డి. రామానాయుడు

దర్శకత్వం: కె. బాపయ్య

ఆంధ్ర-సీడెడ్: నవయుగ  నైజాం: విజయా సురేష్ పిక్చర్స్

